## ముఖ చిత్రం

# సి.పి. బ్రౌన్ ఊహా చిత్రం

జనవరి 1979 భారతిలో సి.పి.బ్రౌన్ తండ్రి డేవిడ్ బ్రౌన్ రేఖా చిత్రం ప్రచురితమైంది. ఈ చిత్రం ఆధారంగా అంటే తండ్రి రేఖా చిత్రం ఆధారంగా తనయుని చిత్రం - సి.పి.బ్రౌన్ చిత్రం - రూపొందించబడింది.

చిత్రకారుడు **శ్రీ మైనంపాటి వేంకటసుబ్రహ్మణ్యం**

ఈచిత్రాన్ని జలవర్ణాలతో అలంకరించిన వారు **రఫ్హాత్ అలి**

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.**

సంపుటి 9 మార్చి 1997 సంచిక 2

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

ముఖచిత్రం : సి.పి. బ్రౌన్ (1798 - 1884)

Printed, Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

సంపాదకుడు : అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

# QUESTION

"In what way are you enriched by the world created by Tolstoy in his works?"

Answered: Erskine Caldwell (USA)

"A person emerges from the experience of reading Tolstoy with a sense of new perceptiveness, greater awareness, and a wider dimension of thought. To the world of his day and to his readers thereafter, Tolstoy has presented a stimulating, exciting, and unsurpassable masterpiece of total enrichment."

Answered C.P.Snow (England)

"I have just written a longish book called The Realists, about eight great novelists, among whom Tolstoy and Dostoevsky take the foremost place. In that book, I have said that all my life I have wondered which is the greatest novel in the world. As a young man, I thought The Brothers Karamazov was the one which affected me most. As I grew older I came to think tthat War and Peacee enriched me more. Simply because ,of its unrelenting truth. Now as an ageing man I am not so sure. I still marvel at Tolstoy's absolute search for the truth, the plain truth about the external world for which he seems to me to have sacrificed every ornament in his prose, which is a lesson to us all. No one has seen more, more vividly than Tolstoy. He thought that Dostoevsky was led astray by his psychological imagination. I am not so sure of that nowadays. I believe that the profound insights of The Brothers Karamazov will remain with me as long as I have life left. Anyway, no literature has anything like these two novels."

# ఇతిహాసపు జ్ఞాపక శకలాలు

డెరిక్‌వాల్కాట్ నోబెల్ సాహితీ బహుమాన స్వీకార ఉపన్యాసం

సంక్షిప్తానువాదం: బి. తిరుపతిరావు

(వెస్ట్ ఇండీస్‌కి చెందిన కవి డెరిక్‌వాల్కాట్ 1930లో జన్మించాడు. తన పద్నాల్గో సంవత్సరంలో మొదటి కవితను రాసిన వాల్కాట్, పద్దెనిమిది ఏళ్ళకి తన మొదటి కవితా సంపుటం Twenty Eight Poems (1948) ప్రచురించాడు. 1950లకల్లా "Henri Christophe' ప్రకటించాడు. 1959నుంచి నాటకరంగంలో కృషి చేస్తూవచ్చాడు. 1967లో ప్రదర్శించబడిన "Dream on Monkey Mountain' అనే నాటకం వాల్కాట్‌కి విశేషఖ్యాతిని తెచ్చిపెట్టింది. నాటకరంగంలో తలమునకలయివుంటూ కూడా వాల్కాట్ కవిత్వాన్ని ప్రాణప్రదంగా చూసుకుంటూ వచ్చాడు. ఈ క్రమంలో

The Cast away and other poems (1965)

The Gulf and other poems (1969)

Another Life (1973)

Sea yrapes (1976)

The Fortunate Traveller (1981)లతో పాటు ఇంకా అనేక నాటకాల్ని రచించాడు. 1992లో వాల్కాట్‌కి సాహిత్యంలో నోబెల్ బహుమతి వచ్చింది.)

ట్రినిడాలోని కరోని మైదానపు అంచుల్లో వున్న చిన్న గ్రామం ఫెలిసిటి. విశాలమైన ఆ మధ్య మైదానంలో చెరకు పెంచుతూ వుంటారు. విముక్తి తరువాత ఆ ప్రాంతానికి చెరుకు నరికే వాళ్ళని పాలెగాళ్ళుగా తీసుకువచ్చారు. ఫెలిసిటిలో కొద్దిమందిగా వున్న జనంలో ఎక్కువ మంది ఈస్ట్ ఇండియాకి చెందిన వాళ్ళు. ఆ ప్రాంతాన్ని చూడటానికి నేను కొంతమంది అమెరికన్ మిత్రులతో కలసి వెళ్ళాను. ఆ దారంత బారతీయుల ముఖాలే కన్పిస్తున్నాయి. అక్కడంత వాతావరణం ఉత్సాహభరితంగా వుంది. ఆ ఆదివారం రోజు సాయంత్రం అక్కడ హిందూ పురాణం 'రామాయణాన్ని' 'రామలీల' పేరుతో నాటకంగా వేస్తున్నారు. వేషధారణల్లో వున్న వ్యక్తులంత ఒక దగ్గర గుమిగూడి వున్నారు. ఆ నేలనంతా అనేకరంగుల జెండాలతో నింపారు. ఎర్రగా, నల్లగా వున్న భారతీయ యువకులు ఆ సంధ్యాసమయపు వెలుతురులోకి బాణాలు వదులుతున్నారు. క్షితిజరేఖని అంటుకుని నీలవర్ణపు పర్వతాలు, మెరుస్తున్న పచ్చిక, కొత్తరంగుల్ని సంతరించుకుంటున్న మేఘాలు. ఫెలిసిటి అనేది ఆగ్రామానికి సరైన పేరు.

పొలంచివర్న వున్న ఒక బహిరంగ షెడ్ క్రింద పెద్దబోనుల్లాగా కనిపిస్తున్న రెండు మట్టితో చేసిన విగ్రహాలు. ఈవిగ్రహాల్ని నాటక ప్రదర్శన ముగిసిన తరువాత తగులబెడతారు. ఆ విగ్రహాలు షేల్లి చిత్రించిన శిథిల ఓ జమాండియస్ లాగా వున్నాయి.

షెడ్‌లో డప్పుల వాళ్ళు మంటలు వేసి, మంటల దగ్గర డప్పుల్ని పెట్టి, శృతి చేసుకుంటున్నారు. ఆ కాషాయి మంటలు, మెరుపు లీనుతున్న పచ్చిక, చేతులతో తయారుచేసిన తగులవేయటానికి సిద్ధంగా వుంచిన దేవుడు; ఇవన్నీ కూడా వుంది ఎక్కడో కుప్ప కూల్చివేయబడిన సామ్రాజ్యవాద అధికారం వున్న ఎడారిలో కాదు. ఇవన్నీ అక్కడివాళ్ళ ఆచారాల్లో బాగం. ఈ ఆచారం ప్రతి సంవత్సరం పునరావృతం అవుతూవుంటుంది. నిప్పులో జరిగే ఈ విధ్వంసం పునఃసృష్టికే.

దేవతలు పొలంలోకి వస్తున్నారు. బహిరంగ రంగస్థలం నుంచి సంగీతధ్వనులు మార్మోం

★ శ్రీ బి. తిరుపతిరావు గారు విజయవాడ సిద్ధార్థ ఆర్ట్స్ & సైన్సు కళాశాలలో ఆంగ్లశాఖలో పని చేస్తున్నారు.

గుంతున్నాయి, వేషాలతో పాత్రదారులు వస్తున్నారు. 'రామలీల'ని నేను చాలా సార్లు చూడాలనుకున్నాను కానీ చూడలేకపోయాను. ఈ నాటక రంగాన్ని చూడలేదు. బహిరంగ స్థలంలో చిన్న పిల్లలు యుద్ధయోధులుగా, యువరాజులుగా, దేవుళ్ళుగా పాత్రధారణ చేసే ఈ నాటకాన్ని అంతవరకు నేను చూడలేదు. ఈ ఈపౌరాణిక కథ ఏమిటి? దాని నాయకుడు ఎవరు? అతని శత్రువులు ఎవరు? నాకేమాత్రం అవగాహన లేదు. ఇటీవల ఇంగ్లాండ్‌లో ఒక నాటకసమాజం కోసం ఓడెస్సె (Odyssey) నాటకీకరించాను ఓడెసెస్సియస్ గురించి ప్రేక్షకులకి తెలుసనుకున్నాను. నిజానికి ట్రినిడాలో ఎవరికీ తెలియదు. ఈ విషయంలో రాముడు, కాళీ, శివుడు, విష్ణువు మొదలయిన వాళ్ళ గురించి నాకు తెలిసినంతే వాళ్ళకి తెలుసు.

ఈ నటులు అద్దంలో తమ ముఖాల్ని చక్కదిద్దుకుని వాస్తవంనుంచి భ్రమలోకి ప్రవేశిస్తున్నామనే భావంతో రంగస్థలం మీదకి వెళతారు. కాని వీళ్ళునటులు కారు. వాళ్ళని ఎన్నిక చేసారు. రోజురెండుగంటలు చొప్పున తొమ్మిది రోజులుపాటు నడిచే ఆ పవిత్రకథలో తమపాత్రల్ని తామే ఎన్నుకున్నారు. వీళ్ళు ఔత్సాహికకళాకారులు కాదు, విశ్వాసాలు కలవాళ్ళు. వాళ్ళని నిర్వచించటానికి నాటకపరిభాషలో పదమేదీలేదు.

వీళ్ళ ప్రదర్శన భాషలో మాండలికం లాంటిది. ఒక గొప్ప ఇతిహాసానికి సంక్షిప్తరూపమే కాని కుదింపుకాదు. ట్రినిడాడ్‌లో నేను ఆరోజు ప్రపంచంలో మహోన్నతమైన ఇతిహాసాల్లో ఒకదాన్ని ప్రతిసంవత్సరం ప్రదర్శిస్తారని తెలుసుకున్నాను. నాటక ప్రదర్శనమొదలు కావటానికి ముందే మేము కరోని మైదానంలో సంధ్యా సమయానికి వచ్చి చేరే ఎర్రకాళ్ళ కొంగల సమూహాల్ని చూడటానికి, పట్టుకోవటానికిమేం అక్కడనుండి కదలిపోవాల్సి వచ్చింది. 'రామలీల' నాటకంలోని పాత్రధారులంత సహజంగా ఎర్రకొంగల సమూహాలు వచ్చేస్తున్నాయి. ఈ వాతావరణంలో గత చరిత్రకి సంబంధించిన విషయమేమి లేదు: 'రామలీల' ఎర్రకాళ్ళ కొంగ సమూహాలు, రెండు దృశ్యాలు ఒకే దృశ్యంగా మారి కన్పిస్తున్నాయి. కరేబియన్‌లో మనోహర దృశ్యాలు చాలా సాదారణ విషయం. ఈ దృశ్యాల్ని చూసినపుడు చరిత్రకి సంబంధించిన ఏ విషాదమయినా అంతర్థానం అవుతుంది.

చారిత్రకనిట్టూర్పు అనేది శిథిలాలనుంచి తలెత్తుతుంది కానీ, ప్రకృతిదృశ్యాలనుంచికాదు.

ఒక పాత్రని ఏకంగా వున్నప్పుడు దానిమీద మనకి వుండే ఆపేక్షకన్నా, ఆ పాత్ర పగిలినప్పుడు ముక్కల్ని మళ్ళీ ఒకటిగా అతకటంలో ఎక్కువ ఆనందం వుంటుంది. ఇటువంటి ఆనంద ఆఫ్రికా, ఆసియా ఖండాల విలువైన వారసత్వాల్ని అతకటంలో వుంటుంది. ఈ అతకటం జరిగిన తరవాత తెల్లచారలు ఏటూ కనపడతాయి. పగిలిన ముక్కల్ని అతుక్కోవటం అనేది యాన్‌టైల్స్ శ్రమ. కష్టంతో కూడిన ఈపొందిన, ఒకదానితో ఒకటి పొసగని ఈ కూర్పు అసలు వస్తువు తయారు చేయటం కంటె ఎక్కువ కష్టసాధ్యం అయిన పని. ఇవ్వాళ యాన్‌టైల్స్ కళ అంటే శిథిలమయిన చరిత్రల్ని అతుక్కోవటమే, పగిలిన పదాల్ని అతుక్కోవటమే. మా ద్వీపసమూహం మౌలిక ఖండంనుంచి విడిపడిన శకలాలకి మారుపేరుగా మారుతూ వుంది.

కవిత్వాన్ని సృష్టించే క్రమంకూడా సరిగ్గా ఇదే, సృష్టించటం కాకపోతే పునఃసృష్టించటం అనవచ్చు.

నిపుణత్వపు స్వేదం కవిత్వం, అయితే అది శిల్పపు నుదిమీద వర్షపు బంధువంత స్వచ్ఛంగా వుండాలి. కవిత్వం గతం, వర్తమానాల్ని సమైక్యం చేస్తుంది. గతం ఒక శిల్పం అయితే, ఆ శిల్పపు నుదిమీద వర్తమానం ఒక మంచు బిందువు లేదా వర్షపు చుక్క. నిక్షిప్తపర్చబడ్డ భాష వుంది. వైయక్తిక పదజాలం వుంది, ఇక కవిత్వం క్రమం తవ్వి తీయటం, స్వీయత్వాన్ని కనుగొనటం. ధ్వనిపరంగా ప్రతివ్యక్తి కంఠం ఒక మాండలికం. అది సామ్రాజ్యవాద భాషా భావనలను, లైబ్రరీల,

నిఘంటువుల, చట్టాల, నగరాల, చర్చల, విశ్వవిద్యాలయాల, రాజకీయ జడాత్మకతల, సంస్థల భాషా భావనలను తిరస్కరిస్తూ తన స్వర్గాన్ని తానే రూపొందించుకుంటుంది. ప్రధాన భూఖండం నుండి తనని తాను విడగొట్టుకునే ద్వీపమే కవిత్వం. నా ద్వీపసమూహపుమాండలికాలు నాకు శిల్పపు నొసటి మిది వర్షపు బింధువులాగానే కన్పిస్తాయి.

స్వంతభాషల నుండి దూరం చేయబడ్డ తెగలు పాత శిధిలాలనుంచి సేకరించిన ముక్కల్ని కలుపుకుంటూ భాషని రూపొందించుకుంటారు. ఆసియా, ఆఫ్రికాలనుండి కొత్తపదజాలాన్ని రూపొందిచుకుంటారు. ఏ బానిసతనానికి లొంగని తన్మయత్వంతోకూడిన సంగీతాన్ని రక్తంలో నింపుకుంటారు. నామవాచకాలకి తిరిగి నామకరణం చేస్తూవుంటారు. స్వంత భాష సముద్రాన్ని దాటటానికి ప్రయత్నించే పొగమంచులాగా చెల్లాచెదురయి పోతుంది. అయితే ఈ పునర్నామకరణం, కొత్తరూపకాలకి రూపకల్పన చేసే క్రమం కొనసాగుతుంది. తన పరికరాల్ని తానే తయారు చేసుకున్న రాబిన్సన్ క్రూసోలాగా కవిప్రతిరోజు అవసరం నుంచి నామవాచకాల్ని కూర్చుతూ వుంటాడు. తనకితాను పునర్నామకరణం చేసుకుంటాడు. నిలువునా ఖాళీ చేయబడ్డ మనిషి స్వయం నిశ్శేష్టతకి కారణం అయే తన మనస్సులోకి తొంగి చూసుకుంటాడు. అదే యన్టిలియన్ అనుభవానికి కేంద్రం. ఆ భంగపడిన శకలాలు, ప్రతిధ్వనులు, విస్మృతమైన ఆదిమ పదజాలం, పాక్షికంగా జ్ఞాపకం వున్న సంప్రదాయాలు అన్నికూడా శిధిలం కాలేదు, బలంగానే వున్నాయి. మద్రాస్ పోర్ట్నుండి వలస కూలీల్ని ఫెలిసిటికి తీసుకువచ్చిన పడవ ఫాటిల్ రజాక్, క్రాలవెల్ బందీల్ని, చైనానుంచి, లెబనాన్ నుంచి అనేక మందిని ఫెలిసిటికి తీసుకు వచ్చిన ఆపడవ, అన్ని, వాళ్ళకి గుర్తున్నాయి.

---

''డెరిక్ వాల్కాట్: అతడు ఎ ఒక్కడూ కాక పోవచ్చు లేదా అందరూ (జాతి)కావచ్చు.'' తనను తాను నిర్వచించుకొనే ప్రభాతంలో ఆకు ఆకుగా, రెమ్మ రెమ్మగా, కొమ్మ కొమ్మగా తనను తా నిర్వచించుకొనే సంస్కృతి ఉదయరేఖలకు తాను సాకీభూతుడవుతున్నాడని ఒక రచయిత మదిలో మెరిసినప్పుడు; అందులో ఏదో ఒక మహదానంద శక్తి ఉంది, అదృష్టం వేడుక ఉంది.'' అన్నాడు డెరిక్ వాల్కాట్ తన నోబెల్ సాహితీపురస్కారస్వీకారోపన్యాసంలో. ఈ మహదానందశక్తి, అదృష్టంవేడుకలతోపాటు, ఒక ఆశీర్వచనం, ఒక బంధించే వాగ్దానం, ఒక నిరత స్మృతి యత్నం, ఆవిష్కారం, ఒక నూతన ప్రజ యెడ, ఒక నూతన భాషయెడ చూపవలసిన భయానక విధులు ఆయన గతనాలుగున్నర దశాబ్దల ప్రణాళికను నిర్వచించాయి. అతని శాబ్దిక ఒనరులు, నిపుణతలు విపులం. వీటిని అతడు తన స్వదేశీ కరేబియన్ సంస్కృతిని ఒక నూతన ప్రపంచం - ఈడెన్ ప్రపంచం కాదు, ఈడెన్ వారస ప్రపంచం, బహుభాషా దేశంగా, అతి జీవించ నిర్ణయించుకొన్న దీవుల సముదాయంగా, - అతని మాటల్లో చెప్పాలంటే ఒక చరిత్ర లేని ఉత్తేజంగా, స్వర్గంలా - ఒక రచయిత స్వర్గంలా,'' పరివర్తితం చేయడానికి ఉపయోగించాడు.

- సంపాదకుడు.

---

వాళ్ళంతా కరేబియన్ నగరం పోర్ట్ ఆఫ్ స్పెయిన్లో వున్నారు. ఇది రచయితకి స్వర్గం లాంటిది.

యాన్టైల్లో దారిద్ర్యమే కవిత్వం. సంతోషం నుండి పుట్టిన సంస్కృతిలో డొల్లతనం వుంటుంది.

అమలులో వున్న అర్థంలో మా నగరాలు నగరాలు కావు, అవి నగరాలు కావాలని కూడా ఎవరూ అనుకోరు. వాటి సమతౌల్యాల్ని, వాటి నిర్వచనాల్ని; వాటిని తక్కువ చేసి చూసేవాళ్ళతో సమమయిన వచనంలోనే అవి చెపుతుంటాయి. ఇక ఇప్పుడు సెయింట్స్ మాత్రమే కాదు,

వి.యస్. నైపాల్ తన రచనల్లో పట్టంకట్టే వీధులు, ఖాళీస్థలాలు, అతని వాక్యాలంత చిన్నవయినబజార్లు, సి. ఎల్. ఆర్. జేమ్స్, జాన్‌రైస్ అన్ని వాటినిర్వచనాల్ని అవే ఇస్తుంటాయి.

ఇక్కడ చాలినన్ని పుస్తకాలు లేవు, నాటకరంగస్థలాలు లేవు, మ్యూజియంలు లేవు అని చెపుతూవుంటారు. పుస్తకాలు లేకపోయినా; మనిషి తన ఆలోచన మీద ఆధారపడతాడు, ఆలోచన అక్షరబద్ధం చేయబడుతుంది.

ప్రపంచ సంస్కృతులు, అవి ఆసియా, యూరప్. ఆఫ్రికా దైనిక చెందినవయినా కావచ్చు. అన్నింటికి ఇక్కడ ప్రాతినిధ్యం వుంది. జాయిస్ డబ్లిన్‌నగరంలో కన్న ఇక్కడ మరింత మానవైవిధ్యం కన్పిస్తుంది. సంప్రదాయం నుంచి కాక; ఇక్కడ పిల్లలు సహజాతాల నుంచి మతాంతర వివాహాలు చేసుకుంటారు, ఇక ఆ తరువాత వాళ్ళపుట్టుపూర్వోత్తరాలు వాళ్ళకి జ్ఞాపకం కూడా రావు.

ఈపోర్ట్ ఆఫ్ స్పెయిన్ తన వ్యాపారంలోనూ, మానవ సమతౌల్యంలోనూ ఆదర్శవంతమైంది. ఇక్కడ పౌరుడు నిరంతరం ముందుకు సాగిపోతుంటాడు, ఆగిపోడు. ప్రపంచం అనుకరించే నగరంగా ముందుకు రాకముందు ఎథెన్స్ కూడా ఇలాగే వుండి వుంటుంది.

ఇక్కడ అద్భుతంగా మలచబడిన చక్కెర మిల్లులు, ఓడరేవులు, ప్రత్యేకమయిన దుస్తుల్లో స్త్రీలు అన్ని కూడా చరిత్రలో బాగాలే. ఈ ప్రాంతాన్ని గురించి రాసిన కానార్డ్. ట్రూలపి లాంటి వాళ్ళ రచనల్లో తీర్పులు కనపబడతాయి. ఈ ప్రణయగ్రీకులు తమ అనారోగ్య క్రిముల్ని ఇక్కడికి తీసుకువచ్చారు. వాళ్ళ వచనం ఇక్కడి ప్రకృతి దృశ్యాల్ని చూడలేక పోయింది. ఇక్కడ జరిగిన ప్రతి ప్రయత్నము, వాస్తుశిల్పంనుంచి సంగీతం వరకు అన్నికూడా అనుకరణలుగా చూడబడ్డాయి. యాన్‌టైల్ పర్వతాల్లో జలపాతం దగ్గరగా నిలబడి చూస్తే నిశ్శబ్దతలో నీకు ఆనీటి శబ్దం కూడా విన్పించదు. యాన్ టైల్స్ జీవితం గతశతాబ్దపు జీవితంలాగా వుంటుంది.

గ్రహం గ్రీన్ లాంటి ఆహ్లాద కరమైన రచనలు చేసిన రచయితలు కూడా కరేబియన్‌ని విషాద చూపుల్తోనే చూశారు. ఈ రచయితలు పూర్తిచేయబడని మానగరాల ఆశల్ని చిత్రించారు. అయితే కరేబియన్ తనున్న స్థితిలో సంతృప్తి చెందుతుంది. కరేబియన్ సంస్కృతి రూపొందే క్రమంలో లేదు. ఇప్పటికే రూపొందింది. దీని సమతౌల్యత గురించి యాత్రికులు, ప్రవాసులు తీర్పులు చెప్పకూడదు దాని ప్రజలే చెప్పుకొంటారు.

ఇక్కడ, ఇప్పుడు నేనున్న వేదికమీద నాకు అభినందలతో కూడిన చప్పట్లు విన్పిస్తున్నాయి. 'చివరికి' మా ప్రకృతి దృశ్యం, మా చరిత్ర గుర్తింపబడింది. 'చివరికి' (At last) అనేది కరేబియన్ నుంచి వచ్చిన మొదటి పుస్తకాల్లో ఒకటి. దాన్ని విక్టోరియన్ యాత్రికుడు చార్లెస్ కింగ్‌స్లే రాశాడు. యాంటిలియన్ ప్రకృతి దృశ్యాల్ని, రూపాల్ని ఇంగ్లీషు సాహిత్యంలోకి మొదట్లో ప్రవేశపెట్టిన పుస్తకాల్లో కింగ్‌స్లే పుస్తకం ఒకటి. దాన్ని నేను చదవనప్పటికీ అది చాలా సానుకూల అంశాలున్న పుస్తకం అని మాత్రం తెలుసు.

నిగూఢమైనది ప్రేమించబడదు. యాత్రికులు ప్రేమించలేరు, ఎందుకంటె యాత్ర చలన పూరితమైనది. ప్రేమస్థిరమైనది. ఒక ప్రాంతాన్ని ఇష్టపడిన వ్యక్తి మళ్ళీ ఆప్రాంతానికి వచ్చి అక్కడ వుండిపోతే, ఇక అతనెంతమాత్రం యాత్రికుడు కాడు. అతడు ఆస్థలానికి, ప్రాంతానికిచెందినవాడే. కొంతమంది కరేబియన్ అంటే తమకిష్టమని అంటుంటారు, అంటే మళ్ళీ రావటం ఇష్టమే కాని అక్కడ వుండటంకాదు.

సెయింట్ జాన్ పెర్సె కవిత్వానికి బహుమతి గెలుచుకున్న మొదటి యాంటిలియన్ కవి. ఆయన గుడెలోప్‌లో పుట్టారు, ఫ్రెంచ్ భాషలో రాశాడు.

కరేబియన్‌మేధస్సు తనతో తాను విభేదించుకునేటట్టు చేయబడింది. పెర్సేసీని గౌరవించటం అంటే శ్వేత ఫ్రెంచి భాషని గౌరవించటంగా మనకు చెప్పబడింది. అయితే ఫెర్సే తన మూలాల్ని

నిరాకరించాడు. గొప్ప రచయితలంతా ఆయామూలాల్ని తుడిచేయాలని చూస్తుంటారు. ఆఫ్రికన్ అయిమి కైజర్‌ని తిరస్కరించ లేనట్లుగానే మనం పెర్సె నిరాకరించలేం.

ఫెర్‌సె రాసిన శకలాలుగావున్న, గౌరవప్రదంగా నిలపబడ్డ కవిత్వం తన తల్లి బాల్యాన్ని గౌరవప్రవంగా నిలపటానికి చేసిన ప్రయత్నం నన్ను తీవ్రంగా గాయపర్చుతుంది. ముఖాల మీద కనిపించే తీవ్ర అహంకారం నాకు ఆ కవితల్లోనూ కన్పిస్తుంది. ప్రపంచచరిత్ర అంటే మన అర్థం యూరప్ చరిత్ర అనే. ఈ దీవుల చరిత్ర ఎవరూ రాయలేదు. ఇప్పుడు వాళ్ళు వాళ్ళ చరిత్రని రాసుకుంటున్నారు:

ప్రతికవికి చరిత్ర అంటూ మర్చిపోబడిన నిద్రలేమి నిండిన రాత్రి. కవిత్వపు గతి, చరిత్ర ఎలావున్నా ప్రపంచాన్ని ప్రేమించటమే.

ఒక సంస్కృతి వికసిస్తున్నప్పుడు, తనని తాను నిర్వచించుకుంటున్న దశలో ఒక కవి ఆదశకి సాక్షిగా నిలవటం పరమానందకరమైన విషయం. ఈ స్థితిలో కవి వైయక్తిక పదజాలం, సంగీతం, జీవిత కథనంగా మారిన కవిత్వం అన్ని ఆనంద కారకాలే. ఈ స్థితిలో శరీరం ఆనందలో తేలిపోతుంది.

ఈ మంగళకరమైన అంశాన్ని ఇక్కడ పండుగగా ఇప్పుడు జరుపుకుంటుంది, ఓ కొత్త భాష, కొత్తప్రజ. ఈ ఉత్సవం భయంగొలిపే బాధ్యతని గుర్తుచేస్తుంది.

ఆ ప్రజల ప్రతిష్టతో కాకపోతే, వాళ్ళ పేరుతో నేను ఇక్కడ మీ ముందు నిలబడి వున్నాను, వాళ్ళ మాండలికానికి ప్రతినిధిగా నేను ముందువున్నాను.

చేత్తో తయారుచేసిన వయొలిన్, గొర్రెచర్మంతో చేసినడప్పు చేసే ధ్వనులకి అనుగుణం సెన్‌సెన్నె అనే అమ్మాయి ఇట్లా పాడుతుంది:

''నువ్వు నన్ను బాధ పెట్టావు అని నేనంటే,
'నిజమే'నంటావు నువ్వు.
నువ్వు నా హృదయాన్ని గాయపర్చావు అని నేనంటే
'అవును నిజం' అన్నావు నువ్వు.
ఇవ్వల్టి పిల్లలు మాత్రం అనవసరంగా ప్రేమించరు''

కారిబ్, అరాక్, టైన్, ఇంకా అనేమంది ఆదివాసుల్ని ఊచకోతకొసిన తరువాత పారిన రక్త ప్రవాహం ఇంకా సజీవంగానే గుర్తుంది ఆఫ్రికన్‌ల మనస్సుల్లో.

చిన్నప్పటినుంచీ నా చుట్టూ వున్న ప్రపంచంలో నేను చూసింది, చదివింది ఇదే. కవిత్వం రాయటం మొదలుపెట్టినప్పటినుండీ చేస్తూవచ్చిందీ ఇదే. చెట్లునరికేవాళ్ళు, బొగ్గులు కాల్చేవాళ్ళు, శరీరానికి మించిన దుస్తుల్ని ధరించిన వాళ్ళుని, తెల్లవారి చలిలో మైళ్ళకి మైళ్ళు నడిచివెళ్ళి తోటల్లో పనిచేసేవాళ్ళుని; చేపలు పటేవాళ్ళు, ఇంకా రకల చేతివృత్తుల వాళ్ళు అందరూ ఆఫ్రికన్ శకలాలే. వాళ్ళు చదవలేరు. చదవబడటం కోసం వున్నారు. వాళ్ళు సరిగా చదవగలిగితే వాళ్ళే వాళ్ళ సాహిత్యం రాసుకుంటారు.

మన టూరిస్టు పుస్తకాలలో కరేబియన్ అంటే నీలివర్ణపు నీటిపుట్ట. రబ్బరు దీవులు, రంగు రంగుల గొడుగుల క్రింది మద్యం సేవించటాలుగా చిత్రించబడుతుంది. ఈవిధంగా ఆ దీవులు గత్యంతరం లేక అవసరంలోంచి తమని తాము అమ్ముకుంటున్నాయి.

అక్కడ తీరాలకి, అడవులకి ఏమయింది? అని అక్కడి ప్రభుత్వాలు కనుక ప్రశ్నించుకునివుంటే వాళ్ళకి అక్కడ ప్రజలకి ఏ మయిందో కూడా తెలిసి వుండేది.

ఇక్కడ ఈ ప్రాంతంలో రెండు విభిన్నమతాలు, విభిన్నఖండాలు బాధే సౌఖ్యమనే భావనని తమ హృదయాల్లో నింపుకుంటున్నాయి.

# మహాభారత నాయకత్వ విలువలు

– అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

ప్రపంచమంతట సమాజాల్లో వైవిధ్యం విపరీతంగా పెరిగి పోతోంది. మనిషికి మనిషికి మధ్య సంబంధాలు పెలుసువారి, వ్యాపారశీలాన్ని సంతరించుకొంటున్నాయి. అంతే కాదు, వ్యక్తి వాదం, అహం కేంద్రవాదం, స్వార్థపరత్వం పెచ్చు మీరుతున్నాయి. ఈ పరిస్థితులలో కుటుంబ సంబంధాల విచ్ఛిత్తి ఎక్కువవుతోంది. విడాకులు, ఎడబాట్లు ఎక్కువవుతున్నాయి. అన్నింటికి మూలమైన సమాజంలో సంభవించే ఈ వైవిధ్య విచ్ఛిత్తి ధోరణులు అన్నిరంగాలలోను – ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో – ప్రస్ఫుట మవుతున్నాయి. భవిష్యత్తు నిరాశాజనకంగా ఉంది. మరి దీనికి విరుగుడు ఏమిటి? ఆధునిక శాస్త్రజ్ఞులు ఆధునిక సిద్ధాంతాలను ప్రతిపాదించారు. అవి బెడిసికొడుతున్నాయి. అందుకని కొంత మంది దీనికి పరిష్కారాన్ని గతంలో అంటే ప్రాచీన సంస్కృతిలో, విలువల్లో, గంథ్రాలలో – చూడాలంటున్నారు. ఏ బైబిల్నో, మహాభారత రామాయణాదులనో ఆశ్రయించాలంటున్నారు. పాశ్చాత్య దేశాల్లోను, భారతదేశంలోనూ యాజమాన్య పద్ధతులను అధ్యయనం చేసే విద్యార్థులు పాత గ్రంథాల బూజు దులుపుతున్నారు. అందులో ఈనాటి సమాజ విచ్ఛిత్తిని నివారించే, అరికట్టే, మంత్రం ఏదైనా లభిస్తుందేమోనని వెతుకుతున్నారు. అయితే వీరంతా గుర్తించ వలసింది ఒకటి ఉంది. నాటి గ్రంథాలలో నిక్షిప్తమై ఉన్న విలువలు, పరిష్కారాలు నాటి సమస్యల స్వభావాలకు సరిపోయినవి. సమాజం నాటికి నేటికి ఎంతో మారింది కనుక, సమస్యలు మారాయి కనుక, పరిష్కారాలు మారతాయి. పూర్తిగా ఆ పరిష్కారాలే యథాతథంగా ఈనాటి సన్నివేశాలకు అన్వయించవు. అయితే నాటి విలువలు పరిష్కారాలు ఏదైనా స్ఫూర్తిని ఈనాటి అన్వేషకునికి అందించవచ్చు. ఆ దృష్టితోనే గత స్మృతులను, శాస్త్రాలను, పురాణ ఇతిహాసాలను, మత గ్రంథాలను అధ్యయనం చేయాలి.

పాశ్చాత్య సమాజం మారినంత వేగంగా భారతీయ సమాజం మారడంలేదు. దీనికి కారణం వేదకాలం నుంచి నేటి వరకు భారతీయ సమాజంలో ఒక అంతర్వాహిని ఎడతెగకుండా ప్రవహించటమే. గాయత్రీ మంత్రం రచన జరిగిన నాటినుంచి నేటివరకు అది జపించబడుతూనే ఉంది. మధ్య ఏనాడు దానికి అంతరాయం కలుగలేదు. భారతీయ సంస్కృతిని చెక్కుచెదరకుండ కాపాడిన ఆ అంతర్వాహిని రహస్యాలను అధ్యయనం చేస్తే, మన ఆధునిక సమస్యలకు ఏదైనా పరిష్కారం లభిస్తుందేమోనని యాజమాన్యవిద్యార్థులు మహాభారతంలోని నాయకత్వ రహస్యాలను శోధించాలి. ఒక ప్రక్క పాశ్చాత్య యాజమాన్య అధ్యయనాలలో, వారు Sun Tzu రాసిన The Art of War, Machiavalli రాసిన "The Prince", Miyamoto Mushaashi రాసిన "The Book of Five Rings" లను అధ్యయనం చేస్తున్నారు. అయితే మనయాజమాన్య శాస్త్రజ్ఞులకు భారతంలో పొదిగిన అటువంటి విలువలను – మన సమస్యలను పరిష్కారాన్ని అందించే విలువలను – అన్వేషించాలనే ఆలోచనే రాక పోవడం శోచనీయం. ఎంత సేపటికీ పాశ్చాత్యాను కరణమే తప్ప, దేశవాళీ విధానాలను అభివృద్ధి చేసే ప్రయత్నాలు చేయడం లేదు. కలకత్తాలోని Indian Institute of Managementలోని మానవ విలువల యాజమాన్య కేంద్రం (The Management Centre for Human Values)వారు, శంకర్ విద్యాకేంద్రం

వారు నిర్వహించే ''శాస్త్రాలలో యాజమాన్యం పై జాతీయ చర్చలు'', ఈ దిశలో జరిగే ప్రయత్నాలలో ముఖ్యమైనవి. ఒక్క భారతమే కాదు, ఇంకా, చాణక్యుని అర్థశాస్త్రాన్ని, పంచతంత్రాన్ని గూడ యాజమాన్య పద్ధతులు, నాయకత్వ విలువల కోసం పరిశీలించవచ్చు. ఉదాహరణకు, నూతనంగా సింహాసనాన్ని అధిష్ఠించిన యుధిష్ఠిరునకు నారదుడు వేసిన ప్రశ్నలు ఏ పరిపాలనా శాస్త్ర గ్రంథాని కైన ముఖ్యవిషయం అవుతుంది. అందులో సిబ్బంది ఎంపిక, చట్టం, శాంతి భద్రతలు, ఆహారం ఇతర అత్యవసర వస్తువుల సరఫరా, ఆర్థికత యాజమాన్యం, న్యాయం, వేగు వ్యవస్థ, యుద్ధం మొదలైన విషయాలన్నీ చర్చిత మయ్యాయి. కాని వీటికి సంబంధించిన సూత్రాలను వల్లెవేయడం వల్ల ప్రయోజనం లేదు. ధర్మరాజు ఏమిచేశాడు? అన్నింటిని అధ్యయనం చేశాడు. ఆచరణలో మాత్రం శూన్యం. పాచికలాటలో తన స్వాతంత్ర్యాన్నే కాదు, భార్యనేకాదు, ఆస్తిపాస్తులనేకాదు, అన్నింటిని ఒడ్డాడు. ఆ సమయంలో ఈ సూత్రాలేమీ అతనికి అడ్డంరాలేదు. కనుక మన మహాభారత నాయకత్వలక్షణాల కోసం వారి ఆచరణలో, శీలంలో చూడాలి.

మహాభారతేతిహాసం ఏ ఇతర పురాణేతిహాసాల కంటె గూడ అభ్యసనాను భవసారంతో నిండి ఉంది. అది కేవలం పాండిత్య ప్రకర్షకాదు. అందులోని పాత్రల శీలం, అనుభవం మనకు మార్గదర్శకం కావాలి.

మహాభారతాన్ని కౌరవ, పాండవ గాథగా చూసి, అందులోని నాయకులను అధ్యయనం చేయపూనుకొంటే మనకు ముందుగా కనిపించే నాయకుడు భీష్ముడు. ఇతడు విఫలనాయకునికి మంచి ఉదాహరణ. యుధిష్ఠరునికి తాను చెప్పిన నీతులను అతడు ఏనాడూ పాటించలేదు . అందుకే కురుక్షేత్రం యుద్ధం జరిగింది. వినాశం, ఘర్షణలలో నుంచి-ఫోనిక్స్‌పక్షి తన బూడిదలోనుంచి తిరిగి పుట్టినట్లు - పుట్టుకురాగల శక్తి యే అసలైన నాయకత్వం; అంతేగాని సువార్తలు ప్రవచించడం కాదు.

మనకు నిజమైన గొప్పతనం అసలు మొట్టమొదటిగా భరతునిలో కనిపిస్తుంది. తన సంతానం వట్టి దద్దమ్మలు, పనికి రాని వారు అయినందున, వారిపై మమకారం చూపక, అక్రమ సంతానమైన భరద్వాజుని తన వారసునిగా ప్రకటించాడు. అంటే అతడు ప్రజలకు మంచి రాజు ఉండాలని కోరాడు. ఈ దృష్ట్యా చూస్తే శంతనుడు ప్రజల క్షేమం కంటే, రక్షణ కంటే, తన ''వైయక్తిక వాంఛ'' ముఖ్యమై, దేవవ్రతుని 'భీషణప్రతిజ్ఞ'కు స్వాగతం పలికాడు. ఈ ప్రతిజ్ఞే భీష్మునికి హస్తినాపురానికి శాపంగా పరిణమించింది. ఈ ప్రతిజ్ఞాపాలనంలో అతడు ప్రజాహితాన్ని మరిచాడు. తన వంశానికి తానే వారసుడననే విషయం గూడ మరిచాడు. త్యాగ పరంగా చూస్తే, అతనిని కొట్టినవారెవరూ లేరు. కాని అతని ప్రతిజ్ఞాబద్ధత, అతనిని ఇతర విషయాలకు మరలేట్లు జేసింది. అతని అధ్యక్షతలోనే కురువంశం ఆత్మహత్య చేసుకొంది. ఆ ఆత్మహత్యలో దోషుల పక్షాన నిలచి అతడు క్రియాశీలంగా పాల్గొన్నాడు. తనను అతిగా ప్రేమించిన మనుమని చేతిలో శరాఘాతాలు తిని, విముక్తమయ్యేదాకా, సింహాసనం మీద కూర్చోకుండ, దానికి బంధితుడయ్యే ఉన్నాడు.

్రుడు సంప్రదాయక శత్రువులను పట్టించుకొన్నాడే (పాంచాలులు- అందుకే ద్రుపదుని శత్రువు ద్రోణుని వెంటనే కొలువులోకి తీసుకొన్నాడు) గాని తూర్పున ఉన్న మగధ జరాసంధుని సామ్రాజ్య విస్తరణ కాంక్షను (దాదాపు నూరుమంది రాజులను జరాసంధుడు బందీలను చేశాడు) కళ్ళుమూసుకొన్నాడు. దక్షిణాదిన కంస, శిశుపాల, భీష్మక, పౌండరీక, నరకాసుర, బాణాసురులు ముఠాగట్టడాన్ని గుర్తించ లేదు. హస్తినాపురానికి చేతివేటు దూరంలో ఉన్న మధురపై జరాసంధుడు మాటిమాటికి దండెత్తితే తనకేమి పట్టనట్టు ఊరుకున్నాడు.

నరకాసుర, బాణా సురుల జంట దక్షిణాదిన బలంపుంజుకొంటుండగా, భీష్ముని సహాయంలేకుండా, కృష్ణుడే వారి ఉద్దేశాలను పసికట్టి, ఒక్కొక్కరినే మట్టుబెట్టాడు. అంబ, అంబాలిక, కుంతి, గాంధారి జీవితాలను నాశనం చేసిన ఈ పరాజితరాజ్యపాలకోవిదుడు, ద్రౌపదిని జుట్టుపట్టుకొని ఈడ్చుకు వస్తుంటే, ఆపడానికి ఏ మాత్రం ప్రయత్నించకుండా చూస్తూ ఉండిపోయాడు. అరిభయంకరుడైన కర్ణుని సేవలు తన సేనకు దక్కకుండా చేశాడు. ఇటువంటి భీష్ముడు ఈ ఇతిహాసంలో శిఖరాయమాణంగా కనిపిస్తాడు- ప్రవచనాలు వల్లించడంలో. ఆచరణలో మాత్రం కాదు. కాకపోతే అతనిని సమర్థించడానికి మనం ఒక మాట చెప్పవచ్చు: ''వంశసంరక్షణార్థం అన్నింటిని వదులుకొన్నాడు. వివాహంచేసుకోలేదు. సింహాసాన్ని ఆశించలేదు. ఇచ్చిన మాట కోసం అన్నింటిని తృణప్రాయంగా వదిలివేశాడు''.

భీష్ముని జీవన విధాన పరిమితులను నిర్దాక్షిణ్యంగా ద్రౌపది ఎండగట్టింది: ''నీవు ఎందుకు క్షాత్ర ధర్మసూత్రాల ప్రకారం నడవడం లేదు?'' అని ప్రశ్నించినప్పుడు, భీష్ముని సమాధానం ఎలాతెలాపోయింది. ఆయన సమాధానం విలువల పతనాన్ని సూచించింది: ''ధర్మం అనేది ఒక శుష్కపదం. బలవంతుడు ఏది చెబితే అదే ధర్మం. బలహీనుని పక్షాన ధర్మం ఉండవచ్చు. కాని అతని మాట ఎవరువింటారు?'' (సభా69)

ధర్మం శ్వాసవదిలింది. ఇక మిగిలింది ఏమంటే కుళ్ళి కంపు కొడుతున్న ''ధర్మంశవం''. దీనికి ప్రతీక శరశయ్య పై ఉన్న భీష్ముని జీవచ్ఛవం.

క్షాత్రధర్మం ఏమిటి? బలహీనుల హక్కులు కాపాడడం. కాని జరిగిందేమిటి? తనకై తాను విధించుకొన్న ప్రతిజ్ఞాపాలనం. వయస్సుతో వచ్చిన అహంకార ఉదాత్తతలు అతని కర్మాచరణాన్ని పరిమితించాయి.

కర్ణుడూ భీష్మునికేమీ తీసిపోలేదు. ఈయనకూ ప్రతిజ్ఞలు ఉన్నాయి, వాటి పాలనమూ ఉంది. సన్నివేశం ఉచ్చనీచాలు పరిగణించకుండ, ఒక విస్మృత ధర్మానికి-స్నేహితుని పక్షాన నిలబడడం; అదితప్పుకానీ ఒప్పుకానీ-కట్టుబడి ఉండడం అతని చర్యలకు మూలం. ఈ ధర్మానికికట్టుబడి ఉండడంకాదు; తనకు తానే ఒక అబ్సెషన్(Obsession)గా తయారయ్యాడు. అదేమంటే భీష్మునికిలాగే 'అహంకార ఉదాత్తత' ఇతనిని ఆడించింది. చూడండి, తన రక్షక కవచకుండలాలను తెలిసి, చేజేతుల, దానం పేరిట (అహంకార ఉదాత్తత) ఇచ్చివేయడం (నీ

(ప్రాణం తీసుకో అంటే తీసుకోవడం అన్నమాట - ఇది దానమా!), తద్వారా తనునమ్మిన ధర్మం- ఉచ్చనీచాలందు స్నేహితునికి విజయం చేకూర్చడం - లో పరాజితుడు కావడం. తన అహం కారం దెబ్బతిన్నప్పుడు, ధుర్యోధనుని పక్షం బలహీన మవుతుందని తెలిసి గూడ, యుద్ధం నుంచి తప్పుకొంటాడు. భీష్మునికి లాగే ఇతనికీ 'అహం' ముఖ్యం. అది దెబ్బతిన్నప్పుడు దేనికైనా లెక్క-చేయడు. చివరకు ధుర్యోధనుని యెడ విశ్వాస పాత్రతను గూడ.

కర్ణునిది ఖండ మూర్తిమత్త్వం. ఒక భాగం మరో భాగానికి వ్యతిరేకంగా పనిచేస్తుంద. తన సహజ కవచాన్ని చీల్చి ఇవ్వడం అనేది అతని అంతరఖండత్వానికి బాహ్యప్రతీక. అంటే అతనిలో రెండు పక్షాలున్నాయి. ఒకటి తేజో (సూర్య) పక్షం. రెండోది చీకటి పక్షం. దుర్యోధనుని ఆలోచనలు దుష్టాలని తేజోపక్షానికి తెలుసు. అందుకే అతడు తల్లి రహస్యాన్ని గౌరవించాడు. ధుర్యోధనుని కోసం యుధిష్ఠురుని పట్టుకొన్నప్పుడు ((ద్రోణుని పన్నుగడ ప్రకారం) మిగతా పాండవులను నిరపాయంగా వదిలి వేశాడు. యుద్ధాన్ని ఆ సమయంలో అంతంచేయగలిగి ఉండి చేయలేదు.

కాని కర్ణునిలో సూర్య భాగాన్ని చీకటి కప్పుతుంది. అతడి ''జీవితరధచక్రం'' ఊబిలో కూరుకుపోతుంది. శకుని దుర్యోధనుల కుట్రలో పాలు పంచుకొన్న కొలది, ఇంకా ఇంకా లోతులకు దిగిపోయింది. ఈ ''మహావీరుడు'' ద్రౌపదిని ''లంజ'' అని తిడతాడు. వివస్త్రను చేయమంటాడు. మరో ఆరుగురితో పదహారేడుల బాలుడు అభిమన్యునితో తలపడి, ''వెనుక నుంచి'' అతని వింటినారిని తెంచుతాడు. కర్ణుని ఆశయం ఒక్కటే? తన కీర్తి కసుగంద కూడదు. తాను గొప్పో, అర్జునుడు గొప్పో తేల్చుకోవాలి. అంతే మరేమీ అతనికి అక్కరలేదు. వెనుకకు తరిగి రాలేని లోతులకు కూరుకుపోయాడు. మృత్యువు మాత్రమే అతనికి విముక్తి ప్రసాదించగలదు.

నాయకుడుగా కృష్ణుడు వీరిద్దరికంటె భిన్నమైనవాడు, సంప్రదాయబద్ధమైన విశ్వాసపాత్రబద్ధతను అవసరమైతే అతడు కాలదన్నగలడు. నియంతలైన బంధువులను దునుమాడ వెనకాడలేదు. ''రాజు అంటే ప్రజాశ్రేయోభిలాషి'' అనే రాజ ధర్మం ఆధారంగా రాజ్యనిర్మాణం కావించాలని, ఎవరో తెలియని పాండవులతో చేతులు కలిపాడు. అర్జునుని చేత సుభద్రను 'కిడ్నాప్' చేయించి, అతనితో వివాహం జరిపించి, వారికొడుకు అభిమన్యునికి యోద్ధగా శిక్షణ ఇచ్చి, పాండవులను తనవారిగా చేసుకొన్నాడు, ఒక్కొక్క నియంతనే దును మాడుతూ చివరకు జరాసంధుని చంపి నూరుగురు రాజులను స్వతంత్రులను చేసి మగధకు పట్టిన పీడను వదిలించాడు. యదు, వృష్ణి, అంధక భోజవంశాలతో ఒక కూటమి ఏర్పరిచాడు. భీష్మ,కర్ణులకు పట్టినప్రతిజ్ఞాపాలనం లాంటి బంధాలేవి కృష్ణుని బంధించలేదు. అవసరమైతే '' ఆయుధం పట్టనన్న'' తన శపధాన్ని గూడ భంగం చేయ వెనకాడని వాడు.

ఇంతటి మహానాయకుడు అంతిమంగా తన ప్రజలతోనే భంగం పొందుతాడు. తను నిర్మించిన సచ్చీల మహాసామ్రాజ్య నిర్మితి చివరకు బూడిద అయింది. అటు హస్తినా పురంలోను ఇటు ద్వారకలోను విలపిస్తున్న వితంతువులు, పసిగందులు తప్ప ఎవరూ మిగల లేదు. అంతకష్టపడి

ఆర్జించిన సింహాసనాన్ని ఎక్కడానికి పాండవులకు ఒక్క కొడుకూ మిగల లేదు. వారి తల్లి కారుచిచ్చులో కడతేర బోయింది. విదురుడు అరణ్యంలో ఆకలితో మరణించాడు. కృష్ణుని మరణమూ అంతగౌరవ ప్రదమైంద కాదు. అతని భార్యలను అర్జునుని సంరక్షణలో ఉన్నా అభీరులు ఎత్తుకు పోయారు.

భారతంలో మరో అద్భుతమైన నాయకురాలు కుంతి. భర్తతో ప్రవాసానికి వెళతానని పట్టుపట్టినా అది కుదరలేదు. ఇతరుల ద్వారా, కొడుకు వెంట కొడుకును, కనవలసిందని భర్త ఆజ్ఞాపించాడు. ఆమె స్థితి ఎంతటి దయనీయం! భర్త ఆజ్ఞాపించినప్పుడు దీనికి ఆమె అంగీకరించలేదు. అతడు చేతులు జోడించి, బ్రతిమిలాడి, భంగపడినప్పుడు ఆమె కాదన లేక పోయింది. ( ఆది 122.129) ఇక్కడ ఆవిడ వ్యక్తిత్వం బహిర్గతమవుతుంది. ఇహ ఆతరవాత కుంతిదే ఎప్పుడూ పై చేయి. సద్బ్రాహ్మలతో సంతానం కనమని పాండు కోరితే; ఆమె కాదని; దేవతలను తనపడక గదికి రావించుకొంది. ముగ్గురి కంటె ఎక్కువ సంతానాన్ని కననని భీష్మించింది. పాండుకోరినా మాద్రికి ఇలాంటి సహాయం ఆమె చేయలేదు. మాద్రి సంతతిని గూడ తన బిడ్డల వలెపెంచింది. ఇక్కడ ఆమె పాత్ర అందం ఇనుమడించింది.

బిడ్డల, తండ్రుల సహకారం లేదు. బంధుమిత్రులు లేరు. వైరి ఆస్థానంలో అంటే పరాయి పంచన బిడ్డలను పెంచవలసి వచ్చింది. భీమునికి విషాహారం పెట్టడంగాని, లాక్షాగృహదహనం వ్యవహారం గాని ఆమె భీష్మునితో చెప్పుకోలేదు.

''నేను కుంతిని, ఐదుగురు బిడ్డల తల్లిని. అంతమంది మధ్య ఉండి గూడ దప్పికతో అల్లాడుతున్నాను''; అని దిగజారి పోతున్న వారి గుండె మంటను ఎగద్రోసింది. భీముడంటే మరులు గొన్న హిడింబి మోహాన్ని అడ్డం బెట్టుకుని, నా అన్నవాళ్ళు లేని ఈ ఐదుగురికి, రాక్షసులతో చెలిమి ఏర్పడేలా చేసింది. దూరదృష్టితో. ఈ సంయోగఫలం ఘటోత్కచుడు. అతడు యుద్ధంలో ఎంతో ఉపయోగపడ్డాడు. ఈ తన మొదటి మనవడైన ఘటోత్కచునికి పాండవులయెడ విశ్వాసాన్ని నూరిపోసింది కుంతి.

''తన ప్రాణం పోయినా రాజు అనేవాడు ప్రజాక్షేమాన్ని చూడాలి. అది రాజధర్మం,'' అని కుంతి ఏకచక్రపురంలో ఉన్నప్పుడు కొడుకులకు బోధించి, ఒక సామాన్యుని రక్షణార్థం భీముని పంపింది. భీష్ముడు పూర్తిగా పరాజితుడైంది ఈ రాజధర్మ పాలనంలోనే.

ఆ తరువాత పాంచాలలో ఒక కులాలుని ఇంట ఉండవలసి వచ్చింది. వర్ణవివక్ష ఉన్ననాటి సమాజంలో, అది హీనకులమే అయినా, అవసరం కొలదీ అక్కడ ఉండవలసివచ్చినా, అవసరాన్ని అద్భుతలాభంగా మార్చుకొంది. పేదరికం ఎలా ఉంటుందో, సమాజంలో అట్టడుగు వర్గాల జీవితం ఎలా ఉంటుందో పాండవులకు రుచి చూపించింది.

సాంప్రదాయికంగా కౌరవులకు శత్రువులైన ద్రుపదులతో సఖ్యం నెరపకోరినదై, ఐదుగురు

కొడుకుల మధ్య చీలికరాకుండడానికి, అర్జునుడు-భీముడు తెచ్చినదేమిటో తెలియని దానివలె మూకాభినయం చేసి, '' ఐదుగురు పంచుకోండి'' అని చెప్పి, పొరపాటున చెప్పినట్లు నాలుకకరుచుకొని, ఇక ఏమైనా తన మాట వమ్ముకారాదని తేల్చి చెప్పివేసింది. ''అసలు నిర్ణయం అంతా కుంతిదే''నని ద్రుపదునితో ధర్మరాజు చెప్పిన మాటల్లో మనకు అవతగత మవుతుంది. ఆమె దూరదృష్టినైపుణ్యం చూడండి: ద్రుపదులతో చెలిమి అత్యంత అవసరం. కొడుకుల మధ్య, ద్రౌపదికోసం చీలికరాకూడదు. అంతేకాదు, ఒక స్త్రీని ఐదుగురు పంచుకోవడం అంటే, అసలు ఆపుత్రులు ఎంతటి కుంతీ విధేయులో, అలా అంత విధేయులుగా బిడ్డలను తీర్చి దిద్దడంలో ఆమె విశిష్టత ఏమిటో బోధపడుతుంది. గాంధారి మాటను ఆమె కొడుకులు ఎప్పుడూ వినలేదు.

ఆ తరువాత మరో ప్రక్క- తన సోదరపుత్రుడు కృష్ణుని అతని బలగాన్ని తన పుత్రులకు అండగా చేసింది.

ఆమె అద్భుత నాయకత్వ లక్షణం చివరిగా తన బిడ్డల క్షేమం కోసం కర్ణునితో కలిసి, తను సిగ్గుతో తలవంచుకోవలసిన కర్ణుని జన్మరహస్యాన్ని, చెప్పాలని నిర్ణయం తీసుకొని, చెప్పడంలో ఉంది. కర్ణుని తిరస్కారం ఆమెకు జయమే అయింది: ''అర్జునుని తప్ప తతిమ్మా తమ్ములను చంపనని మాట ఇచ్చాడు''. అంతేకాదు, ఇది విన్నప్పటి నుంచి కర్ణుని అంతరంగం బలహీనమై పోయింది. ఎలాగంటే, కర్ణుడేమో తన స్వంతతల్లి కొడుకుతో యుద్ధం చేస్తున్నానని ఎరిగి చేస్తుంటే, అర్జునుడేమో, ఎవరో సూతుని పుత్రునితో పోరాడుతున్నాని భావిస్తూ యుద్ధం చేశాడు.

సత్యవతి కంటె గూడ-కారల్ గూస్టాఫ్ యూంగ్ (మనో విజ్ఞాన శాస్త్రవేత్త) సిద్ధాంత పరంగా గూడ-కుంతికన్యయే, ''అక్రమ సంతానం కన్న వెంటనే, తరిగి కన్యాత్వం ప్రాప్తిస్తుంది''; అనే వరం ఇద్దరికీ ఇవ్వబడింది. ఈ కన్యాత్వం; మనస్సు ఆంతరికస్థితికి సంబంధించింది. ఇది ఏ ఒక ప్రత్యేక పురుషుని మీద బానిసగా ఆధారపడి ఉండని స్థితి. ఈ స్థితి ఉండి చేసే చర్యలు సంప్రదాయబద్ధాలుగా ఉండవు.

కుంతి జీవితం నుంచి ఎంతో నేర్చుకొంది. సమాజ సంక్షేమానికి సంబంధించి కాని, తన బిడ్డల సంక్షేమానికి సంబంధించిగాని, వెంటవెంటనే నిర్ణయాలు తీసుకోగలిగింది. భారతంలో, కృష్ణుని తరవాత, కుంతి మాత్రమే మనకు ఏకైకంగా కనిపిస్తుంది. మహానాయకులు అప్పుడప్పుడు ఆశ్చర్యకరమైన నిర్ణయాలు చేస్తూ ఉంటారు. కుంతీ అంతే. సాధించవలసిందంతా సాధించాక, వానప్రస్థానానికి, ధృతరాష్ట్రగాంధారులతో బయలుదేరింది. అక్కడ అరణ్యంలో, బహుశా ఒక యజ్ఞక్రతువు నుంచి బయలుదేరిన మంట, ఆమెను కబళించి వేసింది.

సత్యవతి, కుంతుల తరవాత మరో ''కన్య'' ద్రౌపది. ఆమె చాంద్రాయణ వ్రతం చేస్తుంది. ఒక భర్తను వదలి మరో భర్త దగ్గరకు వెళ్ళేటప్పటికి ఈ వ్రతం వల్ల ఆమె తరిగి కన్య అవుతుంది.

కుంతి తరవాత ఈమే పాండవ రథచక్రానికి కీలకం అవుతుంది. అంతే కాదు, పాంచాల-పాండవ-యాదవ సంయోగనాకి కేంద్రబిందు వవుతుంది.

అత్తగారు కుంతి సూర్య, యమ, వాయు, ఇంద్రులతో తాత్కాలిక సమాగమాలు చేస్తే, సంప్రదాయ విరుద్ధంగా, ఐదుగురు భర్తలను అంగీకరించి అందరినీ అంతగా సంతృప్తిపరిచే సవాలును స్వీకరించింది ద్రౌపది. ''అందరినీ అంతగా సంతృప్తిపరిచే ఆ రహస్యమేమిటి? చెప్పమ్మ'', అని సత్యభామ విస్తుపోయి, ఆరహస్యం చెప్పమని ద్రౌపదిని కోరవలసి వచ్చింది.

ఎవరూ సాహసించని సాహసం ఆమె చేసింది. కురు పెద్దలను 'ధర్మం' అంటే ఏమిటో చెప్పమని నిగ్గదీసింది. మరో స్త్రీ అయితే అలా అడగడానికి బెంబేలు ఎత్తి పోయేది. భర్తలు మూగలయ్యేటప్పటికి ఆవిడ సహనం చచ్చింది. తనను ఈడ్చుకువచ్చారు. ఈడ్చుకు వచ్చిన వానిని భర్తలు క్షమించారు. ఆ తరవాత విరటుని కొలువులో భర్త తనను సన్నగా మందలించాడు. కీచకుని శవంతో చితిపై ఎక్కించడానికి ఆమెను మోసుకుపోయారు. తరవాత ప్రతి ఒక్కరు యుద్ధానికి సన్నద్ధంకాగా, భర్తలు శాంతి కోసం కృష్ణుని ప్రయత్నించమన్నారు. అయినా ఆమె పిచ్చిపిచ్చిగా ప్రవర్తించలేదు. భర్తల యెడ విశ్వాసిగానే ఉంది. అంత్యం మరీ అధ్వాన్నంగా ఉంది. పుత్రులు సోదరులు అంతా అశ్వద్ధామ చేతిలో హతమయ్యారు. ద్రౌపది రాణి అయింది కాని ఆమెకు తనకుగా ఏమీ మిగల లేదు. చివరకు హిమాలయ సానువులలో చనిపోతూ ఆమె కుప్పకూలి పడిపోయినప్పుడు, తాను దాస్యం నుంచి విముక్తి ప్రసాదించిన ఐదుగురు భర్తలలో ఏ ఒక్కరు ఒక్క ఓదార్పు మాటైనా పలకలేదు. యజ్ఞాగ్ని నుంచి పుట్టిన యజ్ఞసేని ''నాథవతీ అనాథవత్'' పంచభర్తృక అయ్యీ భర్తలేనిది అయింది. ఈ మహాద్భుతమైన ''కన్య'' తనకై తానేమీ కోరుకోలేదు. విలువలు అణగాని పోతున్న ఈ యుగానికి అంతం పలికి నూతన యుగాన్ని స్వాగతించడంలో తాను ఒక పరికరాన్ని అన్న సంగతి ఆమెకు బాగా తెలుసు. కృష్ణుని ఆధ్వర్యంలో జరిగే ఈ యజ్ఞానికి తనను తాను సమిధగా సమర్పించుకొంది. మానవ విలువలు ఆధారంగా రుషిపుంగవులు సమాజాన్ని నిర్దేశిస్తే దానిని రాజులు కాపాడాలి. మహాభారతకాలంలో విలువలు పడిపోవడానికి ఒక కారణం ఇంద్రప్రస్థంలోగాని, ద్వారకలోగాని, విశ్వామిత్ర, వశిష్ఠుల లాంటి ఋషులు లేకపోవడమేనంటారు. ప్రతి కీలక సమయంలోను వ్యాసుడు సమయానికి వచ్చి ఏదో మలుపుతిప్పి పోయినా, అతని ప్రభావం అంతగా లేదు. స్వర్గారోహణ పర్వంలో వ్యాసుడు విలపిస్తాడు: ''నేను నెత్తినోరు కొట్టుకొని చెబుతున్నాను, ఎవరూ నామాట వినడం లేదు! ధర్మంలోనుంచే విజయం సంతోషం వస్తాయి''.

మరి ధర్మం ఎందుకు ఆచరించబడలేదు? ఈ భారతేతిహాసంలోని ఏ పాత్ర సమాధానం ఇవ్వదు. కృష్ణుడు గూడ ( గీతను తప్పిస్తే). అయితే మహాభారత నాయకులు వారి అనుభవాలను మన ముందుంచారు. కావాలంటే మనమూ ఆ అనుభవాల నుంచి నేర్చుకొని ప్రగతి నిరోధకంగా కాక, అభివృద్ధి పరంగా మనప్రవర్తనను తీర్చిదిద్దుకోవచ్చు.

# మనిషి ఎందుకు జీవిస్తున్నాడు?

డా. సంజీవ దేవ్

మనిషి ఎందుకు జీవిస్తాడు? మరణించటం చేతకాక జీవిస్తాడా? ఎందుకు మరణిస్తాడు మనిషి? జీవించడం చేతకాక మరణిస్తాడా? మరణించటం చేతకాని వ్యక్తికి జీవించటం మాత్రం ఏవిధంగా చేతవుతుంది? నిజానికి, మరణించటం కంటే జీవించటం కష్టమైన పని. అంటే జీవించటం కంటే మరణించటం సులభమైనపని. సులభమైన పనిని చేయలేని వ్యక్తి కష్టమైన పనిని చేయగలడా? కనుక జీవించటం అనేది మరణించటం చేతకాక కాదు; కాని మరణించటం మాత్రం జీవించటం చేతకాక మాత్రమే. మరణం అనేది జీవితంలోని ఒక భాగం, జీవితం అనేది మరణంలోని భాగం కాదు.

మనిషి ఎందుకు జీవిస్తాడు? మనిషికూడ ఒక జీవి. జీవి ధర్మం జీవించటం కనుక జీవి అయిన మనిషి జీవించక ఏమి చేస్తాడు? అటువంటప్పుడు, మిగతా మనిషికాని జీవులంతా ఎందుకు జీవిస్తున్నాయో మనిషి అయిన జీవి కూడ అందుకే జీవిస్తున్నట్లా? కాదు.

మనిషికంటే భిన్నమైన జీవులన్నీ కేవలం జీవించే నిమిత్తమే జీవిస్తుంటాయి. అంటే, ఆకలిని తీర్చుకోటం, సంతానాన్ని కనటం వాటిపని. మనిషికూడా వాటివలనే ఆకలిని తీర్చుకొంటాడు, సంతానాన్ని కంటాడు. కాని అంతటితోనే ఆగడు, ఇంకా ఎన్నో చేస్తాడు. అసలు ఆకలిని తీర్చుకొనే విధానంలో, సంతానాన్ని కనే విధానంలో కూడ మిగతా జీవులకూ మనిషికీ తేడా వుంది. మిగతా జీవులకు ఆకలి తీరటం ప్రధానం, మనిషికి ఆకలి తీరటం కంటే కూడ నోటిరుచి ప్రధానం. సంతానం కనటానికంటే కూడ కామతృప్తి ప్రధానం. జంతుజాలానికి సంవత్సరం పొడవునా కామవాంఛ వుండదు. కొన్ని తరుణాల్లో మాత్రమే వాటికి కామవాంఛ జనిస్తుంది. వాటి కామవాంఛ తీరటం అంటే వాటికి గర్భోత్పత్తి కూడ జరగటం అవుతుంది. కనుక వాటికి గర్భోత్పత్తి నిమిత్తమే కామ వాంఛ కలుగుతుంది.

మనిషికి నిరంతరం కామవాంఛ కలుగుతుంది. కామతృప్తి జరిగినపుడల్లా గర్భోత్పత్తి జరగదు. వీటన్నిటినీ పరిశీలించి చూస్తే మనిషి కేవలం ఆకలి తీరటానికి మాత్రమే ఆహారం తినడు, కేవలం సంతానోత్పత్తి కోసమే కామ వాంఛను తీర్చుకోడు; రుచినిమిత్తం కూడ ఆహారం తింటాడు, సుఖానుభూతి నిమిత్తం కూడ కామ వాంఛను తీర్చుకొంటాడు. దీని అర్థం మనిషి కేవలం ఏదో ప్రయోజనం నిమిత్తం కాక ఆనందం నిమిత్తం తన జీవితాన్ని సాగిస్తాడు. ఒక్కమాటలో చెప్పాలంటే మనిషి ఎందుకు జీవిస్తాడంటే ఆనందం నిమిత్తం జీవిస్తాడు. ఆనందం లభించక బాధలు లభించినపుడు మరణిస్తాడు. జగత్తులో జరుగుతున్న ప్రతి ఆత్మహత్యకూ కారణం ఆనందానికి బదులు బాధలు లభించటమే.

కనుక మనిషి మిగతా జీవులవలె జీవించే నిమిత్తం మాత్రమే జీవించడు, ఆనందంనిమిత్తం జీవిస్తాడు. ఆనందం కూడ అందరు మనుషులకూ ఒకటిగా వుండదనేది అందరెరిగిన బహిరంగ సత్యం. ఒకరి ఆనందం ఇంకొకరికి నిరానందంకావచ్చు. బాధలేకుండా వుండటం మాత్రమే ఆనందంకాదు. అందుకని బాధవుండటం ఆనందం అనికాదు. బాధలేకుండా వుంటూ ఒక సుఖానుభూతి మానసంలో సజీవమై వుండటం ఆనందం. బాధను తీసేసుకోటం, ఆనందాన్ని తీసుకోటం. అయితే, బాధను దేనితో తీసేయాలి? దానంత అది తొలగుతుందా? బాధతొలగినందువల్ల ఆనందం వస్తుందా, లేక ఆనందం వచ్చినందున బాధతొలుగుతుందా? చీకటీ వెలుగూ ఒకే చోట సహజీవనం చేయజాలనట్లే బాధా ఆనందం కూడ ఒకే తావున ఒకే సమయంలో కలిసివుండలేవు. చీకటిపోయినందువల్ల వెలుగు వస్తుందా, లేకవెలుగు వచ్చినందువల్ల చీకటి పోతుందా? సందేహంలేదు, వెలుగువచ్చినందు వల్లనే చీకటి పోతుంది. అదే విధంగా ఆనందం ప్రవేశిస్తేనే కాని బాధతొలగదు.

ఎందుకు జీవిస్తాడు మనిషి? జీవితంలో ఆనందం అనేది ప్రధానమైనా కూడ ఆనందం నిమిత్తమే జీవిస్తున్నాననే స్పృహమనిషిలో నిరంతరం మేల్కొని వుండదు. ఆనందమే తన ధ్యేయం అనేది తన అ చేతనలో జీర్ణించివుంటుంది. అందుకే ఆనందాన్నివ్వని అనేక పనులను కూడ మనిషి చేస్తూనే వుంటాడు. ఆనందం అనే ధ్యేయాన్ని అటువుంచి పరిశీలించిచూస్తే మనిషి ఒకందుకే కాక ఎన్నిటినిమిత్తమో జీవిస్తున్నాడు. అయితే, అవన్నీ కూడ ఆనందం నిమిత్తమే అన్న జ్ఞాపకం మాత్రం వ్యక్తంగా వుండక అచేతనలో దాగి అవ్యక్తంగానే వుండివుంటుంది.

ఎందుకు జీవిస్తున్నాడు అన్నపుడు ఫలానందుకు జీవిస్తున్నాడని చెపితే, ఆ 'ఫలాని' అనేది వకటి మాత్రమే అయితే చాలదు. అది ఒకటి కంటే మించివుండాలి. అప్పుడు కాని సరిపోదు. ఇందులో మరొక విశేషం కూడ వున్నది. మనిషి అంటే ఒకడు మాత్రమే కాదు, మానవజాతి అంతా కూడ. మనిషి అంటే పురుషుడు, మనిషి అంటే స్త్రీ, మనిషి అంటే పిల్లలు, మనిషి అంటే బీదవాడు, ధనికుడు, పండితుడు, పామరుడు, రోగి, నీరోగి, ఇంకా ఎన్నో! వీరందరూ వేరు వేరు పనుల నిమిత్తం జీవిస్తున్నారు; నేపథ్యంలో మాత్రం వీరందరి ధ్యేయం ఆనందమే.

మనిషి ఏదో పని చేస్తూనే వుంటాడు. ఏ పనిచేస్తున్నాకూడ జీవించేవుంటాడు. జీవించివుండంది ఏ పనీ చేయలేడు; అదేవిధంగా ఏ పనీ చేయంది జీవించి వుండలేడు. జీవిస్తూన్నంతవరకు ఏ పనీ చేయకుండా వుండలేడు. ఏ పని చేయకపోయినా, జీవించటం అనే పని నైనా బ్రతికున్న మనిషి చేయక తప్పదు. జీవించటం కూడ పనే. కనుక ఏ పనీ చేయని మనిషి సృష్టిలోనే లేడన్నమాట. మనిషికి పుట్టుకతో వచ్చిన పని జీవించటం అనేదే.

మనిషి ఎందుకు జీవిస్తున్నాడంటే జీవించటానికే జీవిస్తున్నాడు అనటం ఉత్తమ సమాధానమేమో! కాని జీవించటం అనేపని జీవించటం ద్వారా జరగదు, మరేదైనా పనిద్వారా మాత్రమే జరుగుతుంది. అందుకే, జీవించే నిమిత్తం మనిషి మరేదైనా పనిని చేయాలి. మరేదైనా పని చేస్తేనేకాని మనిషి జీవించడు, జీవించివుంటేనే కాని మరేదైనా పని చేయజాలడు. కనుక జీవించటం, మరొక పనిని చేయటం అనేవి మనిషి ఒకే సమయంలో చేస్తుండాలి.

తిండి తినంది మనిషి జీవించలేడు. జీవించివుంటేనే తిండి తినేది; చచ్చిన మనిషి తిండేమి తినగలడు? తిండి తింటేనేకాని మనిషి జీవించడు అన్నపుడు తిండి ఎట్లా దొరుకుతుంది అనే ప్రశ్న ఎదురవుతుంది. తిండి తినటం అనేపని మనిషిని జీవింపజేస్తుంది కాని జీవించటం అనేపని మనిషికి తిండి పెట్టదు. తిండినిమిత్తం మరేదైనా పనిని చేయాలి.

జంతువులను చంపటం ద్వారా తిండి లభిస్తుంది, ఆకులను, కాయలను, దుంపలను సేకరించటం ద్వారా తిండి లభిస్తుంది. పైరులను పెంచటం ద్వారా తిండి లభిస్తుంది. అంటే జీవించటానికి ఇవన్నీ అవసరం అని. ఎందుకు జీవిస్తున్నాడు మనిషి అంటే ఈ పనులన్నీ చేయటానికి జీవిస్తున్నాడని అర్థమా? అవును, కాని వీటన్నిటిని కూడ చేయటానికి జీవిస్తున్నాడు కాని వీటిని మాత్రమే చేయటానికి జీవించటం లేదు.

జీవించాలంటే తిండి కావాలి, తిండి కావాలంటే ఆహారసేకరణనో, ఆహారోత్పత్తినో చేసుకోవాలి. వాటికి సమర్థత కావాలి. ఆ సమర్థత అందరికీ సమానంగావుండదు. సమర్థత కావాలి. ఆ సమర్థత అందరికీ సమానంగావుండదు. సమర్థత కలవాళ్లకు సరైన ఆహారం దొరకటం, సమర్థత తక్కువైన వాళ్లకు తక్కువ ఆహారం దొరకటం, అసలు సమర్థత లేనివాళ్లకు ఆహారమే లభించక పోవటం, ఆ కారణంగా కొందరు తిండి లేక వ్యాధి పీడితులు కావటం, దానితో మరణించటం.

ఈ సమర్థతా అసమర్థతల మూలంగా మానవుల్లో కలిమి, లేమి అనేది అతి ప్రాచీన కాలంలోనే ఏర్పడినాయి. అందువల్ల మానవులు పీడకులు, పీడితులు, లేక కొల్లగొట్టే వాళ్లు, కొల్లగొట్టబడేవాళ్లు అనే రెండు ప్రధాన వర్గాలుగా చీలిపోయినారు. సమర్థులు కలిమివున్నవాళ్లుగా,

అసమర్థులు లేమి వున్నవాళ్లుగా పరిగణించబడ్డారు.

ఒక వర్గం వారు ఆకలితీరిన తరువాత ఏమి చేయాలని ఆలోచిస్తుంటే మరోవర్గం వారు ఆకలితీరటానికి ఏమిచేయాలా అని ఆలోచించసాగేరు. మొదటి వారు తినటానికి బ్రతుకుతుంటే రెండవ వారు బ్రతకటానికి తింటున్నారు. పెంపుడు పిల్లీ, పెంచబడని పిల్లీ రెండున్నాయట. పెంపుడు పిల్లికి తిండికొదువ లేదు. యజమానులు రకరకాలైన పదార్థాలతో దాని పొట్టనింపుతుంటారు. ఆకలి అనే సంగతే దానికి తెలియదు. అయినా, అది ఎలుకలు కనపడితే చంపి పారేస్తుంది తినకుండా. ఇక పెంచబడనిపిల్లి తనకు కనిపించిన ఎలుకలను చంపి ఆకలి తీర్చుకొంటుంది.

కడుపునిండిన పిల్లీ, ఆకలితో వున్న పిల్లీ రెండూ కూడ ఎలుకలను చంపుతాయి. కడుపు నిండిన పిల్లి క్రీడ నిమిత్తం ఎలుకలను చంపితే ఆకలితోవున్న పిల్లి తినటానికి వాటిని చంపుతుంది. అంటే మొదటిది ప్రాణులను చంపటానికి బ్రతుకుతుంది, రెండవది బ్రతకటానికి ప్రాణులను చంపుతుంది! ఈ విషయం విఖ్యాత ఆర్థిక వేత్త గాల్ బ్రెయిత్ చెప్పినట్లు గుర్తు.

ఎందుకు జీవిస్తున్నాడు మనిషి అనే ప్రశ్నకు కొందరు తిండి నిమిత్తమే జీవిస్తున్నారు, మరికొందరు తిండికంటే మించిన విషయాల నిమిత్తం జీవిస్తున్నారని సమాధానించవలసి వుంటుంది. ఆకలి తీరిన వాళ్ల ఆహారాన్ని గురించి ఆలోచించాలసిన పని వుండదు కనుక శారీరక అవసరాలకంటే మానసిక అవసరాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వటం ద్వారా, వివిధాలైన విద్యలను, శాస్త్రాలను, కళలను అభ్యసించటం ప్రారంభించారు.

ప్రాధమిక భౌతిక అవసరాల అనంతరం, అంతకంటేసూక్ష్మమైన విషయాల్లో ఆనందాన్వేషణ చేయటం సహజం. దారిద్ర్యంతో బాధపడేవాళ్ళు ఆకలితీర్చుకొనే పనితోనే తీరిక లేకుండా వుంటున్నపుడు ఇక మానసిక విషయాలను గురించి ఆలోచించే అవకాశం ఎక్కడ లభ్యం చేసుకోగలరు? అందువల్ల ఈ వర్గంలో విద్యాభ్యాసం, శాస్త్రజ్ఞానం, కళాభిజ్ఞత వికసించటానికి వీలు లేకుండా పోయింది.

మానవ సమాజం ఈ రెండు విధాలుగా చీలిపోవటంతో ధనికులూ దరిద్రులూ అనే లోతైన, వెడల్పయిన అఖాతం ఏర్పడింది మనుషుల్లో. ఈ అఖాతం పూడటానికి ధనికులు ఇంకా ఎక్కువ ధనికులు కావటం, దరిద్రులు ఇంకా ఎక్కువ దరిద్రులు కావటం ద్వారా జరగదు; ధనికులను దరిద్రులుగా మార్చటం ద్వారా కూడ జరగదు. ధనికులు దరిద్రులుగా మారితే లోకంలో అన్నమే దొరకదు.

దరిద్రులను ధనికులుగా మార్చటం ద్వారా మాత్రమే మానవకల్యాణం వికసించటానికి వీలు. పండితులు పామరులు కావటం కాదు కావలసింది, పామరులు పండితులు కావాలి. ఆరోగ్యవంతులురోగులుగా మారటం కాదు కావలసింది, రోగులు ఆరోగ్యవంతులుగా మారాలి. అదేవిధంగా ధనికులు దరిద్రులుగా కాక దరిద్రులు ధనికులుగా మారాలి. అందుకే దేశంలో దారిద్ర్యాన్ని తొలగించాలి. కనుకనే ''గరీబీహటావో''.

ప్రజలందరిలో ఆర్థిక సమృద్ధి ఏర్పడినప్పుడు ఆకలి బాధ తీరుతుంది. అది తీరినపుడు ఎన్నెన్నో మానవకల్యాణానికి తోడ్పడేపనులను, ఎన్నెన్నో మానసిక శక్తులను మేల్కొల్పే పనులను, ఎన్నో నిర్మాణాత్మక కార్యక్రమాలను, ఎన్నో సృజనాత్మక ప్రక్రియలను, ఎంతో శాస్త్రీయ పరిజ్ఞానాన్ని, మనం నివసించే భూగోళాన్ని గురించే కాక, అనంతమైన బ్రహ్మాండ గోళంలోని అనేక విషయాలను గురించి కృషి చేసే అవకాశం దొరుకుతుంది.

ఎందుకు జీవిస్తున్నాడు మనిషి అనే ప్రశ్నకు అప్పుడు ఎన్నో సమాధానాలు దొరుకుతాయి. తినటానికి జీవిస్తున్నాడు, తిండిని ఉత్పత్తి చేసుకోటానికి జీవిస్తున్నాడు, మనుషుల సంఖ్యను

పెంచటానికి జీవిస్తున్నాడు (ప్రస్తుతం మనుషుల సంఖ్య తగ్గించటానికి జీవిస్తున్నాడు.), జ్ఞానోపార్జన కోసం జీవిస్తున్నాడు, కళాసృష్టి నిమిత్తం జీవిస్తున్నాడు, ఆలోచించటానికి జీవిస్తున్నాడు, అనుభూతించటానికి జీవిస్తున్నాడు, ఆరోగ్యంగా వుండాలని జీవిస్తున్నాడు, అకాలంలో మరణించకుండా వుండాలని జీవిస్తున్నాడు, ఇంకా ఎన్నెన్నో పనుల నిమిత్తం జీవిస్తున్నాడు, కొందరు జీవిస్తున్నాకూడ తాము జీవిస్తున్నట్లు గుర్తుండదు వారికి!

జీవించటం పైన మనిషికి ఎంత అనురాగమో! జీవించటానికి మనిషి తన ధనాన్ని, మానాన్ని, ఎన్నిటినో వదలుకుంటాడు, ప్రాణాన్ని తప్ప! ఇది సాధారణ విషయం. ఇక ఇందులో అపవాదాలు లేకపోలేదు. కొదరుంటారు, తమ ధనం నిమిత్తం, మానం నిమిత్తం, ఇంకా చాలావాటినిమిత్తం తమ ప్రాణాన్ని వదులుకుంటారు. జీవితంలో ఆనందం దొరికినన్నాళ్లుజీవించి దానికి బదులు బాధలు దొరకటం సాగినపుడు జీవించటానికంటే మరణించటానికి ఎక్కువ ఇష్టపడతారు; తమను తామే చంపుకొంటారు.

పర్యవసానం ఏమంటే మనిషి ఆనందం నిమిత్తమే జీవిస్తాడు, అదిదొరకనపుడూ, దానికి బదులు బాధలు దొరకుతున్నపుడూ తన్నుతాను ఈభూమి మీద లేకుండా చూచుకొంటాడు. మరణించినందున ఆనందం దొరకదు కాని బాధ లేకుండా పోతుంది. ఆనందాన్ని అనుభవించటం అందరికీ చేతవుతుంది కాని బాధను భరించటం అందరికీ చేత కాదు.

కొందరికి చావటం మాత్రమే తెలుసుకాని చంపటం తెలియదు; మరికొందరికి చంపటం మాత్రమే తెలుసుకాని చావటం తెలియదు; ఇంకొందరికి చంపటం తెలుసు, చావటం తెలుసు. ఇక చంపటం, చావటం రెండూ తెలియని వారు ఎందరో వుంటారు. చంపటం తెలియనవసరం లేదు కాని చావటం మాత్రం తెలియాలి. లేని చో వీరు మరణం ఆసన్నమైనపుడు వణకిపోతారు. మరణంపైన ఇష్టాన్ని పెంచుకోమని కాదు, మరణంపైన నిర్భయాన్ని పెంచుకోమని.

జీవితంలో మూడు ప్రధానఘట్టాలుంటాయి. జన్మించటం, జీవించటం, మరణించటం. జన్మించటం ఆది, మరణించటం అంతం, జీవించటం మధ్యది. ఆది అంతాలమధ్యది జీవితం. అంటే పుట్టటానికీ చావటానికీ మధ్యది బ్రతికుండటం. పుట్టుక భూతకాలానిది. భూతకాలం మళ్లీరాదు. మనిషి జీవిస్తున్నపుడు మళ్లీ జన్మించడు తాను స్వయంగా, ఇతర్లను మాత్రం జన్మింప చేస్తాడు.

జన్మించటం భూతకాలానికి చెందితే మరణించటం చెందుతుంది భవిష్యత్‌కు. ఈ రెంటికీ మధ్యవున్నజీవించటం చెందుతుంది వర్తమానానికి. మూడు కాలాల్లోకీ వర్తమానకాలం ఎక్కువ విలువైంది. కారణం, మిగతా రెండు కాలాలకు కూడ వర్తమానకాలం ప్రాతిపదిక. వర్తమానంలోని ప్రతిక్షణం భూతకాలంలోకి జారిపోతుంటుంది; భవిష్యత్‌లోని ప్రతిక్షణాన్ని వర్తమానం తనలోకి తీసుకొంటుంటుంది.

మూడు కాలాల్లోకి వర్తమానకాలం ఎక్కువ విలువయినట్టిది అయినట్లే జననం, జీవితం, మరణం ఈ మూడిటిలోకీ వర్తమానానికి చెందిన జీవితం ఎక్కువ విలువైంది. నిజానికి జననం లేంది జీవితం లేదు, మరణం లేంది జీవితపు పరిణామం లేదు. అయినా, ఈ రెంటి కంటే జీవితమే ప్రధానమైంది, కారణం, జననం మరణం కూడ జీవితం నుండే జన్మిస్తాయి. మనిషి జన్మించటం తన తల్లితండ్రుల జీవితాలనుండే. కనుక మనిషి జన్మించేది జీవితం నుండే, తిరిగి జీవితాన్ని అందుకొనేది జననం నుండే. జీవితం లేంది మరణం కూడ లేదు.

జీవితం నుండి జననం, మరణం మాత్రమే కాక ఇంకా ఎన్నో ఆవిర్భవిస్తాయి. సాహిత్యం, సంగీతం, చిత్రం, శిల్పం, నాట్యం, నృత్యం, శాస్త్రం ఇంకా అటువంటివి, అటువంటివి కానివి ఎన్నో జీవితం నుండే ప్రాదుర్భవిస్తాయి. అయితే, అందరి జీవితాలనుండి అవన్నీ ఉద్భవిస్తాయా

అంటే ఉద్భవించవు; కొద్ది మంది జీవితాలనుండి మాత్రమే అవి ఉద్భవిస్తాయి, ఎక్కువమంది జీవితాలు వాటిని ఆస్వాదిస్తాయి.

ఎందుకు జీవిస్తాడు మనిషి? శ్రేయం నిమిత్తం, ప్రేయం నిమిత్తం జీవిస్తాడు. శ్రేయం అనేది మేలు కలిగించేది, ప్రేయం అనేది ఆనందం కలిగించేది. జీవితంలో ఈ రెండూ ప్రధానమైన ప్రధానాలు.

ఒక వస్తువు తినటానికి మధురంగా వుంటుంది. అది ప్రేయం. కాని అది కడుపులో నొప్పిని కలిగిస్తుంది. కనుక అది ప్రేయం అయినప్పటికీ శ్రేయం కాదు. మరోక వస్తువు శరీరానికి ఆరోగ్యం కలిగిస్తుంది, కాని అదితింటూంటే చేదుగా వుంటుంది. కనుక అది శ్రేయమే కాని ప్రేయం కాదు.

ఒక కావ్యం ఎంతో రసాత్మకంగా రచించబడింది. కాని దానిలోని విషయం సమాజానికి కీడుకలిగించేదిగా వున్నది. అటువంటప్పుడది ప్రేయమైందేకాని శ్రేయమైంది కాదు. మరోకావ్యం ఎక్కువ రసాత్మకంగా రచించబడలేదు, కాని అందులోని విషయం సమాజానికి మేలుకలిగించేదిగా వున్నది. కనుక అది శ్రేయమైంది కాని ప్రేయమైంది కాదు. ఇంకో కావ్యం రసాత్మకంగాను రచించబడింది, అందులోని విషయం సమాజానికి శ్రేయం కలిగించేది గానువున్నద్ది. అందువల్ల ఆ కావ్యం శ్రేయమైందీ ప్రేయమైందీ కూడ.

జీవితం కూడ అంతే; తాను సుఖంగా జీవించటం ప్రేయం, తన తోటివారిని సుఖంగా జీవింప చేయటం శ్రేయం. తన సుఖజీవనం ఇతర్లకు దుఃఖజీవనంగా పరిణమించకూడదు. తన సంతోషం ఇతర్లకు కూడ సంతోషంగా వుండాలికాని ఇతర్లకు విషాదంగా వుండకూడదు.

ఇతర్లను బాధించి తాను ఆనందం పొందటం, ఇతర్ల చేత బాధించబడి ఇతర్లకు ఆనందం ఇవ్వటం రెండూ వాంఛనీయాలు కావు. మొదటిదాన్ని మనోవైజ్ఞానిక పరిభాషలో 'శాడిజం' అనీ, రెండవదాన్ని 'మెసోకిజం' అనీ అంటారు. ఇతర్లను బాధించటం ఎంత అవాంఛనీయమో ఇతర్ల చేత బాధించబడటం కూడ అంతే. ఒకరికి బాధ ఇవ్వకూడదు, ఒకరినుండి బాధను అందుకోకూడదు. ఇతర్లను భయపెట్టటం, ఇతర్లకు భయపడటం రెండూ కూడ మానవలక్షణాలు కాదు, మానవతానీతి కాదు, ఆదర్శజీవన రీతి కాదు.

జీవితంలోని దుఃఖ దైన్యాలు పూర్తిగా నశించి సుఖశాంతులు పూర్తిగా వికసించటం అనేది జరగటం మంచిదే కాని ఆ విధంగా జరగటం ఎంతవరకు సంభవమో! దుఃఖదైన్యాలు కొంతవరకు తరగటం, సుఖశాంతులు కొంతవరకు పెరగటం సంభవమైన విషయం, మనిషి కష్టాలకు తాను దూరంగా పారిపోక కష్టాలను తననుండి దూరంగా పారద్రోలటం సముచితం.

'' ఎందుకు మనిషి జీవిస్తాడు'' అనే ప్రశ్న ఎందుకవసరం? దీని బదులు'' ఎట్లా మనిషి జీవిస్తాడు'' అనేది ఎక్కువ అవసరమేమో!

ఎందుకు జీవిస్తాడు మనిషి?

జీవిస్తాడు తన శ్రేయం కోసం, సమాజశ్రేయం కోసం. జీవిస్తాడు తనప్రేయం కోసం, సమాజప్రేయం కోసం.

తానే సమాజం అనుకోటం స్వార్థం.

సమాజమే తాననుకోటం నిస్వార్థం.

# తెలుగు సూర్యుడు - సి.పి.బ్రౌన్
# (1798-1884)

- జానమద్ది హనుమచ్ఛాస్త్రి

తెలుగు భాసా సాహిత్యాలు ఆలనా పాలనా లేక నిరాదరణకు, నిర్లక్ష్యానికి గురైన కాలంలో కారణ జన్ముడుగ అవతరించి, మినుకు మినుకుమంటున్న ఆంధ్రసాహిత్య దీపాన్ని స్నేహహస్తం చేసి, ప్రజ్వలింపచేసిన సాహిత్య సముద్ధారకుడు సి.పి.బ్రౌన్.

**1817** నుండి మూడేళ్ళ పాటు మద్రాసులో ఉద్యోగ శిక్షణ పొందిన బ్రౌన్ **1820** ఆగష్టు **19.20** తేదీల ప్రాంతంలో కడప కలెక్టర్ హన్‌బరికి, రెండవ సహాయకుడుగ కడపలో కాలుమోపాడు. కడపలో ఉద్యోగిగా చేరినప్పటికి పరిస్థితిని బ్రౌన్ మాటల్లోనే.

"I was then sent to the cuddapah (kadapa) district, where I presiadled in a police office for two years; all the work being carried on in Telugu, but like wise in Kannada, Marata or Hindustani. Hunbury under whom I served talked Telugu flunetly, and impelled by zeal as well as necessity, in two years I equalled him. I soon acquired the colloquial Telugu; not to speak it well, but better than my neighbours, for at that day no Englishman had ever studied Telugu throughly. Some few had a name as good scholars, but their skill was far from great" (Literary Autobiography of C.P.Brown Page. 31) **1820** ఆగష్టు నుండి రెండేళ్లు కడపలో కలెక్టరుకు సహాయకుడుగ పనిచేసిన తర్వాత **1822**లో మచిలీపట్నంలో జిల్లాకోర్టు రిజిస్ట్రార్‌గా; రాజమండ్రిలో Head Assistant to the Collector and Magistrate గా పనిచేసాడు. **1826** జనవరి **10**వ తేదీన జిల్లా కోర్టు రిజిస్ట్రార్‌గా చేరి **1829** ఫిబ్రవరి దాక, అసిస్టెంట్ జడ్జి; జాయింట్ క్రిమినల్ జడ్జిగా పని చేసాడు.

అప్పుడే, కడపలో బంగళా మరియు తోట కొన్నాడు. పదేళ్ళకు పైగా వాటిని తన స్వాధీనంలో వుంచుకొన్నాడు. అయోధ్యాపురం కృష్ణారెడ్డి యిచ్చిన లెక్కల మేరకు బ్రౌన్, బంగళా మరియు **15** ఎకరాల తోటను రూ.**3500**లకు కొన్నాడు. బంగళాలో కొంత భాగాన్ని అద్దెకు ఇచ్చి, తక్కిన భాగాన్ని పండిత మండలికి నివాసం కొరకు ఇచ్చాడు. వివిధ ప్రాంతాల నుండి తెప్పించిన తాళపత్ర కావ్యాలను పరిష్కరించి శుద్ధ ప్రతుల తయారికి వారిని నియమించుకొన్నాడు. వారి జీత బత్తెములన్నిటిని తన సొంత పైకంతోనే భరించేవాడు. కడపలో రెండు బడులను స్వంతపైకంతో పెట్టాడు.

తెలుగు సాహిత్య సముద్ధరణ మహాయజ్ఞం జరిగిన, ఆ బంగళాను గురించి, బ్రౌన్ తన ఆత్మకథలో ఇలా వ్రాసుకొన్నాడు.

".....and I saved no money. Indeed there were always from ten to

---

★ జానమద్ది హనుమచ్ఛాస్త్రి, ఆంగ్ల ఆంధ్ర సాహిత్యాలలో సవ్యసాచి. కడప ప్రభుత్వ కళాశాలలో ఆంగ్లోపన్యాకులుగా పనిచేసి రిటైరై, ప్రస్తుతం కడప సి.బి.బ్రౌన్ గ్రంధాలయం కార్యదర్శిగా ఉంటున్నారు. అక్షరరశ్మికి 'సంపాదకులు'

twenty Brahmans and Sudras in my pay employed in transcribing native authors in preparing correct editions in framing indexes and commentaries. Thus there were three Separate sets of Brahmins engaged under my roof which people called "Brown College".

తాటాకుల్లో శిథిలమైపోతూ, కొన ఊపిరితో కొట్టుకలాడుతుండిన తెలుగు కావ్యాలను కాలగర్భంలో కలిసిపోకుండా పునరుద్ధరించిన మహానీయుడు బ్రౌన్. ఈ తెలుగు సాహిత్య పునరుత్థాన కార్యంలో బ్రౌన్ దొరకు సన్నిహితంగా కృషి చేసిన వారిలో అయోధ్యాపురం కృష్ణారెడ్డి, ధర్మపురం సుబ్బన్న, రావిపాటి గురుమూర్తి శాస్త్రి, పర్యం అద్వైత పరబ్రహ్మశాస్త్రి గరిమెళ్ళ వెంకయ్య, జూలూరి అప్పయ్య, ములుపాక బుచ్చయ్యశాస్త్రి మున్నగు వారు సాహిత్య మహోద్యమంలో పండితులు ఏరీతిగ బ్రౌనుకు సహకరించారో ఆవిధంగా బ్రౌన్‌కు అత్యంత ప్రీతి పాత్రుడుగ సేవ్య సేవక సంబంధాలకు అతీతమైన ఉదాత్త చిత్తంతు. బ్రౌన్‌ను కొలిచిన నిజాయితీ పరుడు, అయోధ్యాపురం కృష్ణారెడ్డి కడపలో బ్రౌన్ బంగళాలో నెలకొల్పబడిన గ్రంథాలయానికి ఆదర్శ గ్రంథపాలకుడుగా వ్యవహరించిన కృష్ణారెడ్డిని బ్రౌన్ "In these plans the Zealous writer of this letter was a most noble and excellent assistant" అని కొనియాడాడు.

**1824**లో మొదటిసారిగ బ్రౌన్ వేమన పేరు విన్నాడు. వెంటనే వివిధ ప్రాంతాల నుండి **15** విభిన్న వ్రాత ప్రతులను తెప్పించుకొన్నాడు. దాదాపు **3** వేల పద్యాలను సేకరించి వాటిలో **693** పద్యాలను నాలుగు భాగాలుగ విభజించి ఇంగ్లీషులో అనువదించి **1829**లో స్వయంగా ముద్రింపచేశాడు. నాలుగవ సంపుటంలోనివి అశ్లీలంగా వున్నందున వాటిని ప్రచురింపలేదని డా॥. ఆరుద్ర గారు వ్రాసారు. ఈ విధంగా తెలుగు సాహిత్య కీర్తిని వేమన కీర్తితోపాటు విదేశాలకు విస్తరింపచేసిన మహాపురుషుడు సి.పి. బ్రౌన్

తెలుగు తాళపత్ర గ్రంధాలను సేకరించి వాటిని కాగితాలపై కెక్కించి, శుద్ధప్రతులను తయారు చేయించి, వ్యాఖ్యానాలు, పీఠికలు వ్రాయించి అచ్చుకు సిద్ధపరచటం కడపలోని బ్రౌన్ కాలేజిలో జరిగిన నిత్య వ్యవహారం.

తెలుగు ప్రబంధ మండలిలో ప్రత్యేక స్థానం ఆక్రమించిన వసుచరిత్రను పునరుద్ధరించి **1829, 30**లో ములుపాక బుచ్చయ్యశాస్త్రి (కడప జిల్లా నందలూరు వాడు) చేత ప్రతిపదార్థ వ్యాఖ్య సామాన్య పాఠకుడికి కూడా సులువుగా అర్థమయ్యే రీతిగా వ్రాయించాడు. వసుచరిత్ర వ్యాఖ్యానానికి పీఠికా ప్రాయంగా బ్రౌన్‌ను ప్రశంసిస్తూ పదిహేను పద్యాలు వ్రాశాడు.

ఆనాడు రాజరాజనరేంద్రుడు, నన్నయ్యను పిలిచి తెలుగు భారతం వ్రాయమని కోరినట్లుగ, ''సకల లక్షణ శాస్త్ర చక్రవర్తి శబ్దశాసన సూత్ర సహిత వృత్తి లక్ష్యలక్షణ గురు లఘు వర్ణగణ వార్తికా వృత్తి వద్వన్మతానువర్తి'' అయిన బ్రౌన్ తనను వసుచరిత్ర విషయం చూడమన్నాడని చెప్పుకొన్నాడు. బుచ్చయ్య వ్రాసిన అంకిత పద్యాలలో అత్యంత ప్రచురిత పద్యమిది.

క॥ నూర్లార్లు, లెక్క సేయక
పేర్లందిన విబుధ జనుల బిలిపించుచువే
మార్యర్థ మిచ్చు వితరణి
చార్లిసు పిలిప్పు బ్రౌను/సాహెబు కరుణన్.

అంకిత పద్యాల్లోని కవిత్వకైవారాలను బ్రౌన్ ఉబ్బిపోలేదు. సామాన్యులకు సైతం అర్థమయ్యే విధంగా జూలూరు - అప్పయ్య శాస్త్రి చేత మరో వ్యాఖ్యానాన్ని (1832-34) వ్రాయించి దానినే ముద్రింపచేసాడు.

బ్రౌన్ గుణపక్షపాతి. వ్యావహారిక, బాషా వాదులలో అగ్రగణ్యుడు. 1825లో తెలుగు భారతాన్ని చదువనారంభించానని, బ్రౌన్ తన స్వీయచరిత్రలో వ్రాసుకొన్నాడు. గ్రంథపాఠాలను, పూరించుకొంటూ పాఠాంతరాలను గుర్తిస్తూ, ఆశ్వాస విభజన గావించుకుంటూ, పద్య సంఖ్య, మధ్య మధ్యలో కథకు అనుగుణంగా ఉపశీర్షికలు ఇచ్చుకొంటూ, శుద్ధ ప్రతిని రూపొందిస్తూ వచ్చాడు. ఇట్లు ఒక్కొక్క దశను దాటుకొంటూ ఆంధ్ర మహాభారతం 18 పర్వాలకు శుద్ధప్రతుల తయారీకి 2714 రూపాయలు ఖర్చు పెట్టాడు. అప్పట్లో బ్రౌన్ నెలజీతం 500 రూపాయలు మాత్రమే.

కడపలో వున్నప్పుడే (1824-25) ధరణి దేవుల రామన్న వ్రాసిన దశావతార చరిత్రలోని అహల్య కథా భాగాన్ని మాత్రం విడిగా వ్రాయించి, అహల్యా సంక్రందనం అను పేరు పెట్టుకొన్నాడు. దానిలోని పద్యాలను ఇంగ్లీషులోనికి అనువదించాడు. శృంగార రసప్రియుడైన బ్రౌన్ మడికి సింగన వ్రాసిన పద్మ పురాణంలోని అహల్యగాథను, సముఖం వెంకట కృష్ణప్ప నాయుడు రచించిన అహల్యా సంక్రందనాన్ని కూడా సేకరించాడు.

''జీవద్భాషను బోధించేవి పుస్తకాలు కావు నిత్యమూ, ప్రజావ్యవహారంలో నుండే భాషే దానిని బోధిస్తుంది.

న్యాయస్థానాలలో నేడు పండితుడు మొదలు పామరుని వరకు సమస్తమైన వారితో మాట్లాడవలసి వచ్చేది. ముద్దాయి, సాక్షి, ఖైది, స్వదేశీయ న్యాయాధికారి. చదువురాని నౌకరు వీరందరూ, నాకు ఒక విధంగా ఉపాధ్యాయులే'' (బ్రౌన్ స్వీయ చరిత్ర – తెనుగు సేత నిడదవోలు వెంకటరావు భారతి, మే1963, పుట 80)

ప్రజల నాలుకపై నడయాడే పలుకు బళ్ళను సామెతలను, చాటువులను, కొల్లగా సేకరించాడు. 8 కథాకావ్యాలను, 41 ద్విపద కావ్యాలను సముద్ధరించాడు. 84 శతకములను సేకరించాడు. వీటిలో పది శతకాలను ముద్రించాడు.

సాంఘిక చరిత్ర నిర్మాణానికి, సాహిత్య చరిత్ర రచనకు, దేశ చరిత్ర నిరూపణకు, భాషా పరిణామ పరిశీలనకు బ్రౌన్ లేఖలు మూలాధారములు. సత్యమును గుర్తించి వానిని సంపుటములుగ కూర్చి భద్రపరిచిన ఆద్యుడు బ్రౌన్ (బ్రౌన్- తెనుగు కావ్య సముద్ధరణము– డా॥ ఆర్.పద్మావతి)

ఇంగ్లీషులో తెలుగు వ్యాకరణం వ్రాసిన వారిలో బ్రౌన్ చాలా ముఖ్యమైనవాడు.. ఆంధ్ర సంస్కృతాల జన్యజనక సిద్ధాంతాన్ని బ్రౌన్ అంగీకరించలేదు.

బ్రౌన్‌కు నిఘంటు నిర్మాతగ అజరామరమైన పేరు వచ్చింది. ఒకటి కాదు, రెండుకాదు 5 నిఘంటువులను కూర్చాడు. పండిత పామర రంజకములైన బ్రౌన్ నిఘంటువులు ఈనాటికీ విశిష్టములుగా వున్నాయి. ఇంచుమించుగా సమస్త భారతీయ భాషలతో పరిచయమున్నవాడు బ్రౌన్. ఆయన ఎన్నో లఘు రచనలు చేశాడు. మంత్రశాస్త్రం. తంత్రశాస్త్రం, శిల్ప శాస్త్రం, ఖగోళ శాస్త్రం, జ్యోతిష శాస్త్రం మున్నగు వాటిని గురించి ఎన్నో వ్యాసాలు రచించాడు. చందోలంకారగ్రంథాలు రాసాడు.

సంస్కృతంలో సౌందర్యలహరికి వ్యాఖ్యానం వ్రాసాడు. ఆయన రచించిన తెలుగు వాచకాలు అప్పట్లో విశేష ప్రచారంలో వుండేవి.

భాషా శాస్త్రంలో కూడా బ్రౌన్ చేసిన కృషిని తక్కువగా అంచనా వేయరానిదని అతని కడప జాబులు తెలుపుతున్నాయి.

గచ్చుగుంతలు, పలుగురాళ్ళు, కరడు, గాబము (కడప మాండలికములో గాదము) మున్నగు పదాల గురించి ఎంతగానో ఆలోచించాడు. కడప జిల్లా బద్వేలు తాలూకాలోని పలుగురాళ్ళ పల్లె గ్రామాన్ని స్వయంగా చూచి గ్రామనామం అర్థనిర్ధారణ చేసుకొన్నాడు.

కడపలోని బ్రౌన్ కాలేజీని గురించి బంగోరె " ఈబంగళాలో ఒక మూల గదిలో చిన్న కర్మాగారంలా, ఒకరు పనిచేస్తూ, పండితులు తాళపత్ర ప్రతులు ముందరేసుకొని శుద్ధప్రతులు తయారు చేస్తూ వ్యాఖ్యానాలు కూరుస్తుండేవారు. నిలువ నీడ లేకుండా పోయిన తెలుగు కావ్య సరస్వతిని ఆహ్వానించి తన బంగళాలో ఒక సాహిత్య పర్ణశాల ఏర్పరచి ఆ వాగ్దేవి నిండు ముత్తయిదువులాగా నడయాడేలా చేయగలిగాడు బ్రౌన్. బహుమంది విద్యార్థులు "తమరు సుకృతంగా పాఠశాల బెట్టి అనేక మందికి ఆంధ్ర గీర్వాణ కావ్య నాటకాలంకారాది గ్రంథములు అభ్యసింపజేస్తున్నారు. సరస్వతికి ప్రస్తుత మందు తమరు వొకరే నివాసస్థానముగా కనపడుతున్నారు. గనుక ఎక్కడెక్కడ ఏ ఏ విద్యలు దాచబడి వున్నవో అవి అన్ని తమంతట తామే తమ సన్నిధికి వస్తున్నాయి; అన్నాడు ములుపాక బుచ్చయ్య శాస్త్రి".

బ్రౌన్ వ్రాతలను పట్టి చూస్తే అతని వద్ద పెద్ద గ్రంథాలయం వుండేదని తెలుస్తుంది. కడపలో గజ్జెల రెడ్డి వద్ద పెద్ద గ్రంథాలయం వుండినట్లు బ్రౌన్ వ్రాతల వల్ల తెలుస్తుంది. కడప ప్రాంతంలోని కొన్ని గ్రంథాలయాలను గురించి వ్రాస్తూ:

Chincholi Appanachari of pata cadapa has a noble sanscrit Library, Rungareddee of Nosum has noble Library (సంస్థానం). In Pallapaud of Duoor, the son of Raghavachari has a library...is a good fellow in Duoor, Gudipal in the Curnam Lakshmipathi's house is a Telugu Library. కడప ప్రాంతాల్లోని గ్రంథాలయాలన్నీ ఆయనకు తెలిసినవే.

కడపకు సంబంధించిన కొన్ని వ్యాసాలు వ్రాసాడు. కడపజిల్లా ప్రొద్దుటూరు సమీపంలోని రామేశ్వరం గ్రామ కరణీకపు మిరాశి వివాదాల నేపథ్యాకి సంబంధించి రెండు సంపుటాలు తెలుగు ఇంగ్లీష్ గ్రంథాలు వ్రాసాడు.

గ్రామ నామాల చరిత్ర పట్ల బ్రౌన్‌కు ఎంతో ఆసక్తి వుండేదనుటకు, కడపను గురించి ఆయన వ్రాసిన Note స్పష్టం చేస్తుంది.

The town "Cadapa' denotes a door way and the people there, fancy the town was so named because it is on the route of the holy city Tirupati (తిరుపతి)(Tripetty of the maps). Thus the City of Genoa in Italy was formally called Janua, as being the gate by which the Gauls entered. గడప. A threshold is the root in A of గడుచుట to pass. So in Hebrew...ober and

in Arabic. In some Geographical dictionaries which copy the assertions made by Sir Charles wilkins we are assured that be name was Cripa, the Sanskrit word for grace; favour. But this is a mistake and arose thus:-The mussalmans were unable to pronounce the hard D in Kada and Changed it into the hard "R' calling it Kurpa or Kripa. There upon Wilkins guesses it to be Kirpu a notion unknown to all natives. But the people on the sport deny that its name was either Kripa or Kirpa. It was thus affirm merely Kadapa a thereshold also pronounced Gadapa. Some natives fancy it was so called as being one way to Shrine at Tirupati are etymon as absurd as that imagined for Genoa from Janua.

బ్రౌన్ కడప పేరును ఆంగ్లంలో Cuddapah అని వ్రాయడానికి ఇష్టపడక Caddapah, Kadapaఅని వ్రాసేవాడు. ఇప్పటికైనా కడపకు సంబంధించి కృత్రిమమైన స్పెల్లింగు గల Cuddapah నుKadapa లేదా Cadapaగా మార్చుటకు కడప పెద్దలు ఆలోచించాలి. 'Ca' ను చ గాను 'Ka'ను క గాను (భారత ప్రభుత్వం వారి లిప్యంత రీకరణం విధానం) మార్చాలి. Kadapa అనటం సముచితం అని ప్రముఖ గ్రంథాలయ శాస్త్రవేత్త డా.వెలగా వెంకటప్పయ్యగారు పేర్కొన్నారు. (''ద్విభాషా నిఘంటువులు బ్రౌన్ కృషి'' సి.పి.బ్రౌన్ - వేమన సంచికలోని వ్యాసం)

తెలుగు ప్రజల మధ్య దాదాపు నాలుగు దశాబ్దాలు గడిపిన బ్రౌన్ ఏనాడూ మత ప్రచారానికి పూనుకోలేదు. ఆనాటి పాశ్చాత్యులలో అరుదుగా కనిపించే సహన దృష్టి అతనిలో నిండుగా వుండేది. మానవతను ఆరాధించిన మనిషి ఆయన కడపలో సంపన్న కుటుంబానికి చెందిన ఒక బ్రాహ్మణుడు చనిపోగా అతని భార్య సహగమనం చేసుకొనుటకు సిద్ధపడుతున్నట్లు విన్న వెంటనే కడప మేజిస్ట్రేటుకు తెలిపి పోలీసుల్ని పంపించే ఏర్పాటు చేయటమే కాక స్వయంగా శ్మశాన వాటికకు వెళ్ళి భార్యను, భర్త శవం వున్న పాడెపై నుండి వేరు చేయించి శవ దహనం జరిగే వరకు అక్కడే వుండినట్లు ఆత్మకథలో బ్రౌన్ వ్రాసుకొన్నాడు.

బ్రౌన్ ఎక్కడ వుండినా కడప విశేషాలను గురించి వివరాలు తెలుసుకొనేవాడు. కాబట్టే కడప సబ్ కలెక్టర్ మెక్డొనాల్డ్ హత్య (15.6.1832) గురించి కడప కరువులో జరిగిన దొంగతనాలు, లూటీలు గురించి ఉయ్యాలవాడ నరసింహారెడ్డి బ్రిటీష్ వాళ్ళను ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాపించిన తీరుతెన్నుల గురించి, యీ విధంగా ఎన్నో విషయాలను జాబుల ద్వారా తెలుసుకొనేవాడు. పండితులు, అయోధ్యాపురం కృష్ణారెడ్డి బ్రౌన్‌కు వ్రాసిన జాబుల ద్వారా కడప చరిత్రలో దాగిన నిజాలెన్నో వెల్లడైనాయి. చరిత్రకు సంబంధించిన మెకంజీ కైఫియత్తులను సేకరించి శుద్ధ ప్రతులు వ్రాయించి చరిత్ర కుపయుక్తమైన వాస్తవాలనెన్నిటినో అందజేసాడు.

‘C.P.Brown was one of the few Scholars who waded through Meckenzie manuscripts and drawing inspiration from and utilising the contents of the historical materials brought out a number of publications by way of translations and explanations such as "wars of Rajas, Memoir of Hyder Ali and Tippoo, Cyclic Tables Carnatic Chronology: When Meckenzie

manuscripts at Madras were perishing, Brown got them transcribed at his own in the G.O.M.L. Madras: as amark of respect for Meckenzie, Brown kept his Portrait (Engraved from the saturdays magazine June 1834, in the library of manuscripts for which he was for some time curator. Brown translated "An Account of the tribes of the Maharatta Brahmuns (Literary Autobiography of C.P.Brown-Page 147)

He translated "Memories of Hyder Ali and Tippoo Sultan from Marathi with annotations, found among the Mackenzine. Collections Written by one Punganuri Rama Chandra Rao, an Officer under the Princess (Literary auto biography of C.P.Brown, Bibliography Page No 155).

బ్రౌన్, డేవిడ్ బ్రౌన్, కౌలే దంపతులకు రెండవ సంతానంగా 1798 నవంబర్ 10వ తేదీన కలకత్తాలో జన్మించాడు. తండ్రి డేవిడ్ బ్రౌన్ కలకత్తాలోని ఫోర్ట్ విలియమ్‌లో క్రైస్తవ మత ప్రచారకుడుగా వుండేవాడు. అతడు బహుభాషా కోవిదుడు. తండ్రి చనిపోయేనాటికి బ్రౌన్ 14 ఏళ్ళవాడు. తల్లి పిల్లలతో లండన్ వెళ్ళగా బ్రౌన్ లండన్‌లోని హెయిల్ బరీ కళాశాలలో చదువు కొన్నాడు. వివిధ పదవులలో రాణించిన సి.పి.బ్రౌన్ చివరి దశలో లండన్ యూనివర్శిటీలో తెలుగు భాషా చార్యుడుగా పనిచేసి 1884 డిసెంబరు 12న తన ఎనభైయేడవ ఏట దివంగతుడయ్యాడు.

బ్రౌన్ ఆంగ్లేయుడు. అవివాహితుడు. జీవితాంతం తెలుగు సాహిత్యోద్ధరణకు పండిత పోషణకు, గ్రంథప్రచురణకు వినియోగించాడు. నిజానికి తెలుగు సాహిత్య రంగంలో తొలిపరిశోధకుడుగ, గ్రంథసంపాదకుడుగ, కీర్తింపదగిన వాడు బ్రౌన్. తెలుగునాట రవాణా సౌకర్యాలు, ముద్రణాలయాలు, అక్షరాస్యత అంతంత మాత్రంగా వున్న కాలంలో తెలుగు వెలుగును దేశాంతర వ్యాప్తి కావించిన సాహిత్యయోగి ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్.

### వ్యక్తి, వ్యక్తిత్వం

బ్రౌన్ సదా సర్వదా సాహిత్య చింతనామత్తచిత్తుడు. దాదాపు 24 భాషలలో పాండిత్యం గడించినవాడు. హిందూ సమాజాన్ని సంప్రదాయాలను విమర్శించని క్రైస్తవుడు. నిరుద్యోగులెందరికో పనులు కల్పించి సహాయపడినవాడు. కుంటి, గుడ్డి, అనాథలకు ప్రతినెలా 500 దాకా దానధర్మాలు చేసినవాడు.

బ్రౌన్ ప్రజాపక్షపాతి. భయంకరమైన డొక్కల కరువు (1832) వచ్చినపుడు సీమప్రాంతంలో క్షామం తీవ్రంగా వుందని ప్రభుత్వానికి నివేదిక పంపాడు. క్షామం (Famine)అను పదానికి మారుగ కొరత (Scarcity)అని వ్రాసి నివేదిక పంపమన్నది ప్రభుత్వం. తాను వ్రాసినదే సరైనదని ప్రభుత్వానికి తిప్పి పంపిన దయామయుడు బ్రౌన్.

కడపలోని బ్రౌన్ బంగళా తోటలో రకరకాల పండ్ల వృక్షాలుండేవి. సుమారు ఏడు ఎకరాల విస్తీర్ణం గల ఆతోటలో ద్రాక్షపంట బాగా పండేది. సాహిత్య కార్యక్రమాల కోసం నియమింపబడిన

పండితుల కోసం. ఆ తోటలోనే మరో బంగళా కట్టించాడు. మొత్తం ఈ ఆవరణలో మూడు కొందడీ బంగళాలు దొరగారికి వున్నట్లున్నాయి. నడిమి బంగళాలో బ్రాహ్మణులు పనిచేసేవారు. ఈతోటను ఇరవై సంవత్సరాలుగా కనిపెట్టుకొని వున్న మాలీలు దొరగారి కొలువులో అదే తోట పనిచేయసాగారు. తోట గొప్పది. రోజూ కపిల తోలేవారు, కాలువలు తీసేవారు, బంగళాలో కుశినీ, గుర్రపులాయం వగైరా వుండేవి. (సమగ్ర ఆంధ్ర సాహిత్యం - IX డా. ఆరుద్ర పుట 159)

బ్రౌన్ తన ఆర్థిక స్థితి గతులను గురించి తన ఆత్మకథలో ఇలా వ్రాసుకొన్నాడు. "Four or Five years I had lived in a very humble style giving every fartting to pay first my Brahumans (Pandits) and Secondly my debts. Even when in the greatest difficulties I gave him from two or three hundred rupees a month to my book schemes."

చాలాకాలం బ్రౌన్ అప్పులతో బ్రతికాడు. ఒక ఆంగ్ల వ్యాపారి వద్ద అప్పులు తీసుకొని ప్రతినెలా కంతులు చెల్లించేవాడు. తెలుగు సముద్ధరణ కోసం 60వేల దాకా అప్పులు చేసి చివరికి అన్ని అప్పులను తీర్చినట్లు తన స్వీయ చరిత్రలో వెల్లడించాడు. బ్రౌన్ ఎన్నో త్యాగరాజ కృతులను, సారంగపాణి పదాలను సేకరించాడు. ఇంత చేసిన బ్రౌన్‌కు మనమేం చేసాం?

బ్రౌన్ చేసిన సేవలను తెలుగువారు మరువ లేరు. ఆ భాషా జీవి నివసించి సాహిత్య యజ్ఞం జరిపిన స్థలంలో, ఆయన స్మృతి చిహ్నంగ కడపలో గ్రంథాలయ భవనం నిర్మింపబడింది. 1976లో డా.జి. ఎన్.రెడ్డి, బంగోరెలు, నాటి కలెక్టర్ డా.పి.యల్.సంజీవరెడ్డి గారిని, ఈ విషయంగా విన్నవించారు. కడపజిల్లా రచయితల సంఘ కార్యదర్శిగా వుండిన జానమద్ది హనుమచ్ఛాస్త్రి గారిని ఈ భవన నిర్మాణానికి పురమాయించారు. భవన శిథిలాలున్న స్థల యజమానికీ.శే.సి. ఆర్.కృష్ణస్వామిగారి నుండి బ్రౌన్ బంగళా శిథిలాలున్న స్థలం (20సెంట్లను) దానంగా అందుకున్నారు. శ్రీకృష్ణస్వామి కుమారుడు శ్రీ.సి.కె.సంపత్ కుమార్ అధ్యక్షుడుగా శ్రీజానమద్ది హనుమచ్ఛాస్త్రి కార్యదర్శిగా 1986లో సి.పి. బ్రౌన్‌మెమోరియల్ ట్రస్టు ఏర్పడింది. జిల్లా కలెక్టరు ప్రధాన పోషకులుగా వుంటున్నారు.

కడప జిల్లా కలెక్టర్ శ్రీ జంధ్యాల హరినారాయణ గారు గ్రంథాలయ భవనానికి 22.1.1987న శంకుస్థాపన చేయగా డా.పుట్టపర్తి నాటి సభకు అధ్యక్షత వహించారు. హరినారాయణగారు భవన నిర్మాణానికి తొలి విడతగా రూ.3 1/2 లక్షలు ఇచ్చారు. తర్వాత కలెక్టర్లు శ్రీమతి చందనాఖాన్, శ్రీ ఏ.కె.పరిద, డా.పి.సుబ్రమణ్యం ఆర్థిక సహాయమందించారు. జిల్లాలోని వదాన్యులు దాదాపు 2 లక్షలు దాకా విరాళాలిచ్చారు. కడప ప్రొద్దుటూరు పట్టణాలలోని ఉన్నత పాఠశాలల విద్యార్థులనుండి 25వేల రూపాలయల విరాళం అందించుటకు తోడ్పడిన ప్రాంతీయ పాఠశాల విద్యాసంచాలకులు రామస్వామి రెడ్డిగారు. జిల్లా విద్యాశాఖాధి కారి, డా. ఆర్.సత్యనారాయణ గారు స్మరణీయులు. శ్రీపసుపులేటి బ్రహ్మయ్య పరికరాలు, పుస్తకాల కోసం 35 వేల రూపాయలు విరాళంగా ఇచ్చారు.

కలకత్తాలోని రాజారామ మోహన్‌రాయ్ లైబ్రరి ఫౌండేషన్ నుండి 30వేల ఆర్థిక సహాయం లభించింది.

**గ్రంథ సేకరణ :**

కడప సమీపంలోని వల్లూరు గ్రామంలో శ్రీపోలేపల్లి వెంగన్న శ్రేష్ఠిగారు 1923లో స్థాపించి నిర్వహించు చుండిన శ్రీ సీతారామ చంద్ర గ్రంథ భాండారంలోని అమూల్యమైన 3500 గ్రంథాలను, బ్రౌన్ గ్రంథాలయానికి విరాళంగా ఇచ్చారు. తిరుమల తిరుపతి దేవస్థానం, తెలుగు అకాడమి, తెలుగు విశ్వవిద్యాలయం. మనస్వినీట్రస్టు (మద్రాసు) శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వంటి సంస్థలు, శ్రీ ఆమంచర్ల నరసింహారావు, డా.చల్లా రాధాకృష్ణ శర్మ, డా.సర్వేశాయి తిరుమలరావు, డా.బెజవాడ గోపాలరెడ్డి, డా.పుట్టపర్తి నారాయణాచార్యులు, డా.కొంగర జగ్గయ్య, మున్నగువారు అమూల్య గ్రంథాలను విరాళంగా పంపారు.

ఆంధ్రప్రదేశ్‌లో విద్యాశాఖ కార్యదర్శిగ పనిచేసి 1968లో పదవీ విరమణ చేసిన శ్రీ.జె.పి.యల్.గ్విన్ లండన్ నుండి తాము ప్రచురించిన తెలుగు ఇంగ్లీష్ నిఘంటువు (1994, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటి ప్రెస్) 1852 నాటి బ్రౌన్ నిఘంటువులను విరాళంగా పంపారు.

ప్రస్తుతం బ్రౌన్ గ్రంథాలయంలో 16,500పైగా తెలుగు, ఇంగ్లీష్, హిందీ సంస్కృత, కన్నడ ఉర్దూ గ్రంథాలు అమూల్యమైన ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు వున్నాయి. ఆంధ్రసాహిత్య పరిషత్ పాత సంచికలున్నాయి.

మద్రాసులోని ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండారంలోని సి.పి.బ్రౌన్ సేకరించిన గ్రంథాలు, మెకంజీ కైఫీయత్తులు, లేఖలు వగైరా సంపుటాలు 60 ప్రతి రూపాలను ఒక్కొక్కటి 2 ప్రతులుగా పంపిన సాహిత్యాభిమానులు శ్రీజె.టి. ఆచార్యులు, ఐ. ఎ. ఎస్.(తమిళనాడు పంచాయతీ రాజ్ శాఖ ప్రిన్సిపాల్ సెక్రటరి) గారు ఈపనికై దాదాపు 25 వేలు విరాళ రూపంగా అందించారు. శ్రీ వేంకటేశ్వర విశ్వావిద్యాలయం తెలుగు విభాగంలోని బ్రౌన్ రచనల 20 సంపుటాల ప్రతి రూపాలు సేకరించి వుంచబడినవి.

1993లో గ్రంథాలయ నిర్వహణకు ఆర్థికవనరుల లోటు ఏర్పడగా కలెక్టర్ శ్రీ.కె.వి.రమణాచారి గారు తమ అధీనంలోని అక్షర రశ్మినిధుల వడ్డీపైకం నుండి ప్రతినెలా రూ.4250లు విరాళంగా లభింప చేసారు. సిబ్బంది వేతనాలు ఈ పైకంతో చెల్లింపబడుతున్నాయి. శ్రీరమణాచారి గారి పూనిక వల్ల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుండి భవన విస్తృతి నిర్వహణలకు రూ.5లక్షల ప్రత్యేక ఆర్థిక సహాయం లభించింది.

రాష్ట్రంలోని ఏగ్రంథాలయానికి లేని భవన ముఖద్వార నిర్మాణం కావించారు శ్రీ ఎస్. నరసింహారెడ్డిగారు. గ్రంథాలయ భవనం (3600 చ.అ) లో సమావేశ మందిరం. ఆరుగదులు, పరిశోధకులు తాత్కాలికంగా వుండేందుకు గది. ఇతర వసతులున్నాయి. ప్రస్తుత భవనం పై మరో అంతస్తు నిర్మాణానికి జాయింట్ కలెక్టర్ శ్రీ ఎ.గిరిధర్ రూ.2.50లక్షలు అందించారు.

గ్రంథాలయంలో ప్రతి గురువారం గణపతి సచ్చిదానంద సభవారి సత్సంగ సమావేశాలు, ప్రతినెల వివేచన స్టడీసర్కిల్ వారి సాహిత్య గోష్ఠులు జరుగుతుంటాయి. ఈ గ్రంథాలయ భవనాన్ని, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీనారాచంద్రబాబు నాయుడు గారు 29.11.1995న తెలుగు ప్రజలకు అంకితం చేసారు.

బ్రౌన్ గ్రంథాలయాన్ని సాహిత్య పరిశోధనా కేంద్రంగా రూపొందించాలని బ్రౌన్ ట్రస్ట్ ఆశయం. తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య నాయని కృష్ణ కుమారి గారు 28.7.1996న గ్రంథాయాన్ని దర్శించారు. త్వరలో బ్రౌన్ గ్రంథాలయాన్ని, తెలుగు విశ్వవిద్యాలయ అనుబంధ

సంస్థగా గుర్తిస్తూ ఉత్తర్వులు పంపారు. తెలుగు వారందరూ తప్పక చూడవలసిన గ్రంథాలయమిది.

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

కార్యదర్శి, సి.పి. బ్రౌన్ మెమోరియల్ ట్రస్ట్ - కడప .4

ఉపయుక్త గ్రంథాలు:

1. సి.పి. బ్రౌన్ చరిత్ర - డా. కొత్తపల్లి వీరభద్రరావు.

2. Literary Autobiography of C.P.Brown. (Sri Venkateswara University Publication)

3. బ్రౌన్ తెలుగు కావ్య సముద్ధరణము: డా. ఆర్. పద్మావతి

4. సమగ్ర ఆంధ్ర సాహిత్యము కుంఫిణీయుగము డా. ఆరుద్ర

5. బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు కడప జాబుల సంకలనం - పర్యవేక్షణ జి. యస్. రెడ్డి పరిశోధన: బంగోరె

6. వ్యాసనవమి: డా. ఎస్. గోపి

7. సి.పి. బ్రౌన్ చరిత్ర: తెలుగు అకాడమి ప్రచురణ

రచన: జానమద్ది హనుమచ్ఛాస్త్రి

8. కడపజిల్లా రచయితల 8వ మహాసభల సంచిక.

## 30 YEARS AGO IN TIME

### The Missing God

A Controversial exploration of the existence of God: "Soren Kierkegaard warned that 'the day when Christianity and the world become friends, Christianity is done away with.' During World War II,the anti-Nazi Lutheran martyr Dietrich Bonhoeffer wrote prophetically to a friend from his Berlin prison cell, 'We are proceeding toward a time of no religion at all.' For many, that time has arrived...'Personally, I've never been confronted with the question of God', says one...politely indifferent atheist, Claude Levi-Strauss...at the College de France. 'I find it's perfectly possible to spend my life knowing that we will never explain the universe.' Jesuit Theologian John Courtney Murray points to...the atheism of distraction, people who are just 'too damn busy' to worry about God at all".

TIME - April 5, 1996.

# కళాకారుడి స్వేచ్ఛ

- హి.

ఒకసారి కళాతపస్వి డాక్టర్ సంజీవదేవ్ గారి ఇంట్లో వారు సృజించిన వివిధ చిత్రాన్ని చూసే అవకాశం కలిగింది. వాటిలో ఆధునిక కళకి చెందిన ఓ వర్ణ చిత్రం నన్ను చాలా ఆకర్షించింది. ఎంత ఆలోచించినా చిత్రంలోని భావం నాకు అర్థం కాలేదు. ఏదో ఆనందం మాత్రం కలిగింది.

''సంజీవదేవ్ గారూ, ఈ పెయింటింగ్ భావం ఏమిటి?'' అడగటానికి సాహసించాను. సంజీవదేవ్ చిరునవ్వునవ్వారు.

''మీకే తెలుంది.''

కొంచెం ఆశ్చర్యపోయాను.

నిజమేనేమో!

సంజీవదేవ్ అలా అన్నారు కనుక ఆలోచించాను. ఏవేవో భావాలు కలిగాయి. అలా ఆలోచనలు రేకెత్తించటంలోనే కళాకారుడి ప్రతిభ ఉందా? నాకు కలిగిన భావాల్లో ఆర్టిస్ట్ భావం ఏదైై ఉంటుంది? ఏవీ కాకపోయినా పరవాలేదా? మరి రచన సహృదయ హృదయైనవేద్యం కావాలన్నారుగా ఆలంకారికులు! లేకపోతే కళాకారుడి ఆశయం ఎలా సిద్ధిస్తుంది. ఏదైనా క్లూ ఉండేనేమో! ఏమైనా అదికళాకారుడి స్వేచ్ఛ. దానికి పరిమితులు లేవు.

చాలా సంవత్సరాల కిందట నేను యువకుడిగా ఉన్నప్పుడు ఓసారి రాజమండ్రిలోని దామెర్ల రామారావు ఆర్ట్ గాలరీకి వెళ్ళాను. గోడమీదినించి ఓ నగ్న చిత్రం వేలాడుతోంది. అదో జవ్వని శరీర సౌష్ఠవ సౌందర్యాన్వేషణాయత్నం. ఒక అధ్యయనం. ప్రకృతి సమస్తం నగ్నంగా కనిపించినట్టయింది. ఏదో తన్మయత ఆవరించింది. ఇంద్రియ వాసనలకి అతీతమైన అలౌకికానందం కలిగింది. ప్రకృతంతా కరిగి చిత్రకారుడి కుంచెలోంచి జాలువారుతూ స్త్రీ మూర్తిగా రూపొందిందా! సౌందర్యం సౌందర్యంగా సాక్షాత్కరిస్తోందా! నాలోని ప్రకృతి అందులో లీనమైపోయిందా?

She is beautiful when clothes are on

She is Beauty itself when clothes are gone అన్నాడు షేక్స్పియర్ ''సానెట్స్''లో. ఎంత గొప్పగా అన్నాడు మహాకవి, అసభ్యత జోలికి పోకుండా!

శరీర సౌందర్యాన్ని ప్రేమించే మానవుడు మానసిక సౌందర్యాన్ని, వ్యవస్థాత్మక శాస్త్రీయ న్యాయాల సౌందర్యాన్ని, సౌందర్యాంతర సౌందర్యాన్ని ప్రేమించే స్థాయికి ఎదగాలన్నాడు ప్లేటో ఏనాడో 'స్త్రీ సౌందర్య రహస్య జీవిత రహస్యం'' అన్నాడు బోరిస్ పాస్టర్‌నాక్. ఇందులో భావం ఏమిటి?

అందమే ఆనందం. కళ్ళకీ, చెవులకీ ఆనందం కలిగించేదే అందం. అందంని అనందమే జీవిత రహస్యం. ఈ అందం వస్తువులో ఉంటుంది, చూసేవాడిలోనూ ఉంటుంది.

★ 'హితశ్రీ' అసలు పేరు M.V.N. ప్రసాదరావు. సుప్రసిద్ధ కథానికా రచయిత. ప్రస్తుతం తెనాలి A.S.N డిగ్రీ కళాశాలలో ప్రిన్సిపాల్‌గా పనిచేస్తున్నారు

సందర్భంలోనూ ఉంటుంది. వస్తువులో ఏ అంశాలు అందాన్ని ప్రస్ఫుటంచేస్తాయి. అనురూప్యత, సంగత, పరిపూర్ణత (Harmony, symmetry and perfection) అని విజ్ఞుల సమాధానం. మానవ ప్రకృతిలో అనురూప్యత, పరిపూర్ణత మౌలికంగా ఉంటాయి. జీవిత సంగ్రామంలో ఇది తాత్కాలికంగా మరుగునపడి మనసు వికలమౌతుంది. సాధారణంగా వికలంగా ఉండే వ్యక్తిమనసు, వ్యక్తి అందాన్ని దర్శించగానే అనురూప్యత చెందుతుంది. అప్పుడు మనసు సమతౌల్యస్థితికి వస్తుంది. అదే ఆనందం. అంటే వస్తువులోని అనురూప్యత వ్యక్తిలోని అనురూప్యతని మాగ్నెట్‌లా ఆకర్షిస్తూందన్నమాట. అదే తన్మయీ భావం. అదే ఆత్మీయత అందం అందం కలిసిపోవటం. అదో అద్వైతస్థితి. అందమైనవి చూసినప్పుడూ, మధురమైనవి విన్నప్పుడూ వ్యక్తి మనసులో అప్రయత్నంగా భావాలుగా నిలిచి పోయిన పూర్వ జన్మ స్నేహాలను తలచుకొంటాడని కాళిదాస మహాకవి మహాద్భుతంగా అన్నాడు.

కళలు సృజించే అందం అలౌకిక ఆనందాన్నిస్తుంది. ఎందుకంటే పాత్రలు, సంఘటనలు వాస్తవ జగత్తుకి చెందినవి కావు కనుక. అందమే జీవిత రహస్యం అనుకొన్నాం కనుక. సౌందర్యాత్మకమైన కళలు జీవితంలో ఘర్షణలు తొలగించుకొని అనురూప్యత, పరిపూర్ణత సాధించాలని మానవుడిని ఉద్బోధిస్తాయి. అలాంటి ఆశయంలో కళాఖండాల్ని సృజించటం కళాకారుడి కర్తవ్యం. అందాన్ని ఎలాసృజించాలి? అంటే అది కళాకారుడి వ్యక్తిత్వాన్ని బట్టి ఉంటుంది. అదికళాకారుడి స్వేచ్ఛ. ''దానికి చట్రాలు లేవు.''

కావ్యం వ్యవహారాల ఎరుకకోసం, శివేతరక్షతి అంటే అమంగళం పరిహరించటం కోసం, సద్యఃపరనిర్వృతి అంటేతక్షణ అలౌకికఆనందం కోసం, కాంతలా ప్రియంగా ఉపదేశించటంకోసం అని మన ప్రాచీన ఆలంకారికులు అన్నారు. ఇవన్నీ ఒక ప్రక్షాళనని స్ఫురింపచేస్తాయి.

మానవుడి శీలాన్ని పెంపొందించటానికి కళలు తప్పని సరి సాధనాలు; అది మానవుడిని మంచి వాడిగా, గుణవంతుడిగా రూపొందిస్తాయి. అయితే, సృజనాత్మక కళాకారుడు సమాజానికి బాధ్యుడుగా ఉండేట్లు చూడటమే సమస్య అన్నాడు ప్లేటో. రసదృష్టి అంటే మనభావోద్రేకాల మీద ప్రభావంచూపే సామాజిక జీవిత దృష్టి అన్నాడు రష్యన్ ఆలంకారికుడు యూరి బొరేక్.

సమాజం అంటే ఒక సంస్కృతి గల ప్రజాసమూహం. సంస్కృతి అంటే వారసత్వంగా వచ్చినఆలోచనలు, అలవాట్లు, జీవిత విధానం. మనది విభిన్న సంస్కృతుల కలయిక. మనభాషలు, వేషాలు, మతాలు, విశ్వాసాలు, సిద్ధాంతాలు వేరు వేరు. అయినా భారతీయ సంస్కృతి అనేది ఒకటుంది. మనకి ఒక తాత్విక దృక్పథం ఉంది. అది ఆధ్యాత్మిక సంపన్నం. మనకి శాశ్వత విలువలు కొన్ని ఉన్నాయి. అలాగే మనవ్యవస్థల్లో కొన్ని బూజుపట్టి ఉండవచ్చు. మంచి విలువల్ని గుర్తుంచుకోవాలి. బూజుపట్టిన వ్యవస్థల్ని ప్రక్షాళనం చెయ్యాలి. కళలు ఇందుకు ఉపకరిస్తాయి. సృజనాత్మక కళాకారుల లక్ష్యం తమ మాధ్యమాల ద్వారా సామాజిక ఇతివృత్తాల్ని స్వీకరించి సమాజాభ్యుదయం లక్ష్యంగా కళాఖండాలు సృజించటం. ఇక్కడ కొన్ని మౌలికమైన ప్రశ్నలుదయిస్తాయి. సామాజిక జీవితానికి స్పందించిన సృజనాత్మక కళాకారుడు తన మాధ్యమం ద్వారా తనని ఎలా అభివ్యక్తం చేసుకోవచ్చు? అతనికి పూర్తి స్వేచ్ఛ ఉందా? అతని సామాజిక బాధ్యత ఏమిటి?

ఈ ప్రశ్నలు ఉత్పన్నమైన నేపథ్యం ఇది! అంతర్జాతీయంగా ప్రఖ్యాతి పొందిన భారతీయ చిత్రకారుడు శ్రీ ఎం. ఎఫ్. హుస్సేన్ పూర్వం గీసిన ''సరస్వతి'', ద్రౌపది, దుర్గ నగ్న చిత్రాల్ని ఇటీవల భోపాల్ నించి వచ్చే ''విచార్ మీమాంస్'' అనే హిందీ మాసపత్రిక ప్రచురించింది. హుస్సేన్ముస్లిం. దీంతో ఆగ్రహావేశులైన కొంతమంది అహమ్మదాబాద్‌లో హుస్సేన్ ఆర్ట్‌గాలరీలోని కళాఖండాల్ని ధ్వంసంచేశారు. హుస్సేన్ దీనికి ప్రతిస్పందించారు. తనది సమకాలీన ఆధునిక

చిత్రకళ అనీ భారతీయ సంస్కృతీ సంప్రదాయాలనుంచి ఉదాహరణలు తీసుకొనే తాను చిత్రాలు వేస్తుంటాననీ, సంకుచిత రాజకీయ దృక్పథంలో చూసేవాళ్ళు మతం పేరు అడ్డం పెట్టుకొని ప్రజల్ని ప్రభావితం చేస్తున్నారనీ; ఇది అభ్యుదయ ఆలోచనా విధానం మీద దాడి అనీ ఆయన అన్నారు. చిత్రకళ అనే ఈ పవిత్ర కార్యం ప్రక్షాళన కోసమే తప్ప విధ్వంసం కోసం కాదని అన్నారు. తనది సింబాలిక్ ఆర్ట్ అన్నారు. సంస్కృతిలోని ప్రతీకలతో తాదాత్మ్యం చెంది ఆతను అనుభూతులతో చిత్రాలు గీస్తానన్నారు.

''పలకించెడి వాడు రామభద్రుడు'', అనడంలో పోతన తనస్వంతం ఏమీలేదని చెప్పుకొంటున్నాడు. అంటే పోతనకు స్వేచ్ఛ ఏమీలేదని అనుకోవాలి. దీనిని మనం ఆర్థర్ కోజ్లర్ "The act of creation" లో చెప్పిన ద్విసంసర్గ (Bissociative) పద్ధతిలో వివరించవచ్చు. ఒక విషయాన్ని గురించి రోజుల తరబడి ఆలోచిస్తున్నప్పుడు, తపస్సు చేస్తున్నప్పుడు, (దీనిని సాంకేతికంగా పొదగడం అంటారు.) ఆకస్మికంగా చేతన (Conscious) అచేతన (Unconscious) ల మధ్య పొరకు రంధ్రంపడి, అచేతన విషయం వెల్లువగా చేతన విషయాన్ని ముంచెత్తుతుంది. ఇదే ద్విసంసర్గం. ఈ స్థితిలో పోతన భాగవతం రాశాడు గనుక అతనికి దానిని తాను రాసినట్లనిపించలేదు. ఇక్కడ పోతనకు స్వేచ్ఛ ఎంత?

సరే ఏదో మతానికో, ఇజానికో నిబద్ధులైనవారికి, కళ ప్రయోజనానికే అనే వారికి – స్వేచ్ఛ మరీ తక్కువ. వాళ్ళు ఆ చట్రంలోనే పని చేయాల్సి ఉంటుంది. Art is neither moral, nor immoral but amoral అనే వారికి స్వేచ్ఛ చాల ఎక్కువ. Art is illusion అనే వారు తాము చిత్రించే వాస్తవస్తువుతో కొంతవరకు నిబద్ధులవుతారు. Art is for Art's sake అనే వారికి స్వేచ్ఛ ఎక్కువే.

అయితే కళాకారుని స్వేచ్ఛ విషయంలో ఒక విషయం గుర్తుంచుకోవాలి. ప్రతి కళాకారుడు ఏదో సంస్కృతిలో జన్మిస్తాడు. ఆ అద్దాలలోంచే ప్రపంచాన్ని దర్శిస్తాడు. ఆమేరకు అతనికి స్వేచ్ఛలేదు. సంస్కృతిని దాటి, బౌద్ధిక వాతావరణా (Climate of opinion)ని దాటి పోగల కళా స్రష్ట నిజమైన స్వేచ్ఛాజీవి.

సంపాదకుడు

ఈ చిత్రాల్ని చూసి చాలామంది గాయపడ్డారు. శ్రీహుస్సేన్ ఈ చిత్రాన్ని ఇలా నగ్నంగా ఎందుకు వేశారు? సరస్వతి చదువుల తల్లి. ''సరస్వతీ నమస్తుభ్యం'' అని అక్షరాభ్యాసంనాడు హైందవ బాలబాలికలు ప్రార్థిస్తారు. ''తల్లీ నిన్నుదలంచి పుస్తకము చేతన్ బూనితిన్'' అని విన్నవించుకొంటారు. రచయితలు పోతనగారి మాటల్లో ''నిన్ను మది గానగ నెన్నడుగల్గుభారతీ?'' అని తపిస్తుంటారు. సరస్వతి అనే దేవత ఎక్కడో మబ్బుల్లో కూర్చుని మన చదువుల్ని పర్యవేక్షిస్తుందని ఎవరూ అనరు. మన విశ్వాసాలకీ, భావనలకీ, తపస్సుకీ ఆలంబునకోసం ఏర్పరచుకొన్న ప్రతీక సరస్వతి.

మన సంస్కృత సంప్రదాయాలు మనకిచ్చిన సరస్వతి కుందేందు తుషారహార ధవళ శుభ్ర వస్త్రాన్విత. అలాంటి సరస్వతిని హుస్సేన్ నగ్నంగా చిత్రించటంలో ఉద్దేశం ఏమిటో ఆయన చెప్పలేదు. ఊహాకి రెక్కలు రావాలి. ఎందుకంటే ఆయన ఒక మతాన్ని కించపరచాలనే ఉద్దేశంతో ఈ చిత్రం వేశారనటం హాస్యాస్పదం. హుస్సేన్ తన చిత్రాలకి మన సంస్కృతీ సంప్రదాయాల నేపథ్యం ఉందంటున్నారు.

సంగీత సాహిత్యాలకి సరస్వతి ప్రతీక. సంగీత సాహిత్యాలు సరస్వతి స్తనద్వయం అన్నారు ప్రాచీనులు. సంగీతం ఓం కారం నించి ఉద్భవించింది. ఓంకారం బ్రహ్మ ( ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ). సాహిత్యంలోని రసానందం బ్రహ్మానంద సబ్రహ్మచారి అని రసజ్ఞులు ( మా జనస్వామి

మాస్టారు ఉవాచ) అంటారు. బ్రహ్మ అంటే సత్. సత్యం, అంటే నిజం. నిజానికి ఆచ్ఛాదనలు లేవు. ఉంటే ''నిజం''కాదు. నిజం నగ్నమైంది. సంగీత సాహిత్యాలు ''నిజాన్ని'' వెల్లడించాలి. అదే సరస్వతీ స్వరూపం. ఇప్పటి సంగీత సాహిత్యాలు వెర్రి పోకడలు మాని సామాజిక తాత్విక నిజాన్ని చాటి చెప్పాలి. అదే ''సరస్వతి'' చిత్రోద్దేశమా? అలా అయితే, చిత్రం వివాదాస్పదం కాకుండా ఉండటానికి చిత్రంలో గాని శీర్షికలోగాని ఏదైనా సూచన ఉండటం ఆవశ్యకం. లేక, ''సరస్వతి'' ప్రతీక ఒక మూఢ విశ్వాసానికి చిహ్నం. దేవతగా భావించే సరస్వతి సాధారణస్త్రీ మాత్రమే. ఇది నగ్న నిజం అని చెప్పటమా? చిత్రకళ ప్రక్షాళనకోసమే అన్నారు. ఇది ప్రక్షాళన కోసమేనా? లేక ఇప్పటి కళాకారులు సరస్వతీ వస్త్రాపహరణం చేస్తున్నారనా? లేక, నగ్నత్వంలోనే దివ్యత్వం ఉందనా?

లేక, ఇది ఒక నగ్న అధ్యయనమా? ఊహ అధ్యయనం ఎలా అవుతుంది? ఇలా ఎన్ని విధాలుగానో ఆలోచించవచ్చు. కొంతమంది సమర్థించ వచ్చు కొంతమంది దురాలోచనలని కొట్టిపారేయవచ్చు. కొంతమంది హుస్సేన్‌గారు ఇతర మతాల్లోని దేవతల్ని ఇలా చిత్రించగలరా? అని అడగ వచ్చు. సమస్య అదికాదు. ఆయన అలా చిత్రించటానికి సాహసించినా, ఇదే పరిస్థితి ఏర్పడుతుంది. ఏ అభ్యుదయం కోసం, ఏ ప్రక్షాళన కోసం ఈ చిత్రాలను చిత్రించారు, ఏమతంవారి దేవతలని చిత్రించారు, అనేవి కొన్ని తర్కించవలసిన విషయాలు. చిత్రకారుడే కాదు, ఏకళాకారుడికైనా ఇతివృత్తాన్ని ఎంచుకొని మలచటంలో ఉన్న స్వేచ్ఛ ఏమిటి? అదే చర్చనీయాంశం.

గోదారి వరదలా సమాజం వ్యక్తిలో జొరబడుతుంది. వ్యక్తి సమాజంలోకి వెలుగులా విస్తరిస్తాడు. దేశకాలమానపరిస్థితుల్నిబట్టి కళాకారుడు సృజనచేస్తాడు. సంస్కృతీ సంప్రదాయాల్లోని విలువల్ని గుర్తు చేస్తాడు. శ్వేతరాన్ని వేలు పెట్టి చూపు తాడు. కళాకారుడు పారదర్శకుడూ, క్రాంతి దర్శకుడు, మార్గదర్శకుడు కనుక స్వతంత్రంగా ఆలోచిస్తాడు. తనని తాను అభివ్యక్తపరచుకోవాలని తాపత్రయపడతాడు. ఈ ప్రయత్నంలోనే అతనికి కొన్ని సున్నితమైన అంశాలు ఎదురవుతాయి. ఇవి అతని స్వేచ్ఛని కొంత వరకు అడ్డుపడతాయి. ఏ వ్యవస్థనయినా సహేతుకంగా సమర్పించవచ్చు. ప్రజాస్వామికంలో ఎవరి విశ్వాసాలు వారివి. కళాకారుడికి ఎవరినీ కించపరిచే స్వేచ్ఛలేదు. ఇక్కడ మనం ఆలోచనకీ, ప్రచారానికీ, ఆచరణకీ ఉన్న శామ్యూల్ జాన్సన్ త్రివిధ భేదం గమనించాలి.

తనకి ఇష్టం వచ్చినట్టు ఏ కళాకారుడైనా ఆలోచించవచ్చు. ఇందులో అతనికి పూర్తి స్వేచ్ఛ ఉంటుంది. ప్రచారానికీ, ఆచరణకీ వచ్చేటప్పటికి ఇతరుల అభిప్రాయాలనీ, వారి దృక్పథాన్ని కొంతవరకుగౌరవించాలిసి ఉంటుంది. ఇతరుల మత విశ్వాసాన్నీ, సభ్యులు సంస్కారాల్నిమన్నించ వలసి ఉంటుంది. ''అది అతని సామాజిక బాధ్యత. నీ స్వేచ్ఛ నీ బెత్తంచివరి వరకే, తరవాత నాముక్కు ప్రారంభమవుతుంది'' అన్నాడు లింకన్ మహోదయుడు. ప్రజాస్వామ్యం అంటే ''నేను'' కాదు ''నువ్వు'' అని ఎవరో ఛలోక్తిగా అన్నారు. అందువల్ల సృజనాత్మక కళాకారుడికి తన ఆలోచనలోనే సంపూర్ణ స్వేచ్ఛ ఉంది. కళాకారుడితో సహా ఎవరికీ అభివ్యక్తిలో సామాజిక బాధ్యతని విస్మరించేసంపూర్ణస్వేచ్ఛ ఉండటానికి వీల్లేదు. లౌకిక రాజ్యమైనా, మతైక రాజ్య మైనా సామాజిక బాధ్యత అనుల్లంఘనీయం. సహజీవన సమాజంలో కళాకారుడి విచ్చల విడితనానికి చోటుండదు. అందరి జాతీయ సామాజిక బాధ్యతలకీ ప్రతీక జాతీయ పతాకం. దాన్ని అందరం గౌరవిస్తాం. దాంతో ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించం. కళాకారుడికీ మినహాయింపు లేదు.

( ఈ విషయాన్ని చర్చించి, వ్యాసం రాయమని నన్ను ప్రోద్బల పరిచిన చిరకాల మిత్రుడు శ్రీ వెంకటేశ్వరరెడ్డికి కృతజ్ఞతలు).



బ్రౌన్‌స్మారక గ్రంథాలయ భవనం - కడప